శ్రీ మాలోల గ్రంథమాల

పదకొండవ పుష్పము

# దివ్య ప్రబంధత్రయి



శ్రీమాన్ కె. వి. రాఘవాచార్య విరచిత

టీకా తాత్పర్య వివరణ సహితము

# దివ్య ప్రబంధత్రయి

కూర్పు

శ్రీమాన్ కారంచేటి తిరుమల వేంకటరాఘవాచార్యులు

ప్రచురణ :

**శ్రీ మాలోల గ్రంథమాల**

శ్రీ అహోబిల మఠం, హైదరాబాద్, ఆం.ప్ర.

# దివ్య ప్రబంధత్రయి

# Divya Prabandhatrai

ప్రథమ ముద్రణ : 2002

ప్రతులు : 500

ప్రచురణ కర్తలు :
**శ్రీ మాలోల గ్రంథమాల**
**శ్రీ అహోబిల మఠం,**
హైదరాబాద్



వెల : 30/-

ప్రాప్తిస్థానము :
**శ్రీ మాలోల గ్రంథమాల**
**శ్రీ అహోబిల మఠం,**
దుర్గాబాయి దేశ్‌ముఖ్ కాలనీ,
హైదరాబాద్ - 500 013.

ముద్రణ :
**సరస్వతీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
నల్లకుంట, హైదరాబాద్-44
ఫోన్ : 7612180

First Edition : 2002

Copies : 500

*Published by :*
**Sri Malola Granthamala**
**Sri Ahobila Muth,**
Hyderabad



Price : 30/-

*Copies available at*
**Sri Malola Granthamala**
**Sri Ahobila Muth,**
Durgabai Deshmukh Colony,
Hyderabad - 500 013
Ph : 7612043

*Printed at :*
**Saraswathi Offset Printers**
Nallakunta,
Hyderabad-500 044
Ph : 7612180




SRIMANNARAYANA RAMANUJA YATHIBHYONAMAHA

*Tridandi Chinna Srimannarayana Ramanuja Jeear Swami*

JEEAR EDUCATIONAL TRUST,
SITHANAGARAM - 522 501
GUNTUR DISTRICT.
PHONE : 77929




Dt :

ప్రియశ్రీమాన్ కె.టి.వి. రాఘవాచార్యస్వామిన్!

శ్రీమతే నారాయణాయ నమః!

అనేక మంగళాశాసనములు

తాము పంపిన దివ్యప్రబంధ కుసుమాలందినవి. వేదవేదాన్త సారాన్నంతటినీ ప్రాంతీయముగ అందరూ అనుసంధించి తరించాలని సంస్కృతభాషకంటే కేర్పైన ద్రావిడాన్ని ఎన్నుకొని. ఆ ప్రాంతంలోని కొందరిని తానే సంస్కరించుకొని వారి ద్వారా తత్త్వసారాన్నంతటినీ సులభ గ్రాహ్యముగ పాడిస్తే అదొక దివ్యప్రబంధమైంది. ఆ దివ్యప్రబంధమునకు ఆది తిరుప్పల్లాండు.

మంత్రానికి ఓంకారం ఆద్యంతాలలో అనుసంధించేట్లుగ ఈ తిరుప్పల్లాండు ప్రబంధానికి అనుసంధిస్తారు. మంత్రాత్మకముగ కీర్తించబడే అష్టాక్షరీమంత్రమున ప్రణవ, నమఃపద, నారాయణ పదములున్నాయి. ఈ మూడింటి తాత్పర్యాన్ని తెలిపే ప్రబంధాలు ఆళ్వార్లగానామృతంలో మూడున్నాయి.

ప్రణవాన్ని వివరించేది తిరుప్పల్లాండైతే, నమఃపదాన్ని కణ్ణినుణ్ శిరుత్తాంబు వివరిస్తోంది. అలాగే నారాయణ పదార్థాన్ని తిరుప్పళ్ళియెళుచ్చి పరిపూర్ణంగ ప్రదర్శిస్తోంది. ఈ మూటినీ అనుసంధిస్తే, నాలాయిరాన్ని అనుసంధించినట్లే నంటారు.

వీటి ప్రాముఖ్యాన్ని మీచే ప్రవర్తింపచేయుదలచి కావచ్చు ఈమూడు ప్రబంధాలను మీచే తెలుగు చేయించారు శ్రీరంగనాథులు. ప్రతిపదార్థ తాత్పర్యాలతో ఈ ప్రబంధాలను తెలుపరిస్తున్నందులకు చాల సంతోషంగ ఉంది. ఆ పద్ధతిలో ప్రచారం జరగటంలేదు. ఎవరూ ఈ మధ్యకాలంలో ఈ శ్రమ పన్ని ఎందుకని తాత్పర్యాలతోనే సరిపెట్టేస్తున్నారు. కాని మీరు జిజ్ఞాసువులకు ఉపయోగపడే రీతిలో ప్రతిపదార్థతాత్పర్యాలతో ఈ మూడు ప్రబంధాలను ముద్రించడం మాకెంతో తృప్తిగ ఉంది. భాష కూడ సులభంగ అర్థం చేసుకోనేట్లుండటం విశేషం. ఇట్లాంటి మరికొన్నింటిని మీరు చేయగల్గుతారని ఆశిస్తూ అనేక మంగళాశాసనములు చేస్తున్నాం.

(చిన్న శ్రీమన్నారాయణరామానుజజీయర్)

2/8/95

శ్రీమతే రామానుజాయ నమః

# మున్నుడి

"భగవద్భక్తోర్ధ్వపుండ్రీ వసిష్ఠః కశ్యపో౽త్రిరగస్త్యః జామదగ్నిర్విశ్వామిత్రో యమోవ్యాసః పరాశరస్సనకసనందన శ్శుకో వామదేవస్స్రబ్రహ్మలోకోభవతి"

అని వేదము చెప్పినట్లు వసిష్ఠాది మహర్షులు అకుంఠిత దీక్షతో ప్రసన్నానుష్ఠానపరులై శ్రీవైకుంఠనాథుని సమాశ్రయించినారు.

శ్రీరంగనాథుడు స్వయముగా 'రామానుజదర్శన' మని నామకరణము చేసిన శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతము శ్రీపరాశరపారాశర్యాది మహర్షులు తమ వేదోపబృంహణములచే స్థిరపరచిన పరమవైదిక సిద్ధాంతము. ఆ మహర్షులతోబాటు భగవత్పారిషదాంశలచేత ఈ లోకమందవతరించిన ఆళ్వారులనబడు దివ్యసూరులు ద్రావిడ భాషామయములైన దివ్యప్రబంధములను ప్రసాదించి విశిష్టాద్వైత సిద్ధాంతమును వేవిధముల వ్యక్తీకరించి స్థిరపరచినారు.

ఇప్పుడీనిన దూడయందు ముందీనిన దూడయందు కంటె ఆవుకు మక్కువ ఎక్కువైన రీతిగా, ఈ దివ్యప్రబంధములందు ఆవేదోప బృంహణములందు కంటె అధికమైన ప్రీతి శ్రియఃపతికి కలిగినది. ఆళ్వారుల దివ్యప్రబంధములివి -

| ఆళ్వార్లు : | దివ్యప్రబంధములు : |
|---|---|
| 1. పొయ్‌గై యాళ్వార్ | ముదల్ తిరువందాది |
| 2. పూదత్తాళ్వార్ | ఇరండాన్ తిరువందాది |
| 3. పేయాళ్వార్ | మూన్రాన్ తిరువందాది |

| | |
|---|---|
| 4. తిరుమళి శైయాళ్వార్ | నాలాన్ తిరువందాది; తిరుచ్ఛందవిరుత్తమ్ |
| 5. నమ్మాళ్వార్ | తిరువిరుత్తమ్; తిరువాశిరియమ్; తిరువందాది; తిరువాయ్మొళి. |
| 6. కులశేఖరాళ్వార్ | పెరుమాళ్ తిరుమొళి |
| 7. పెరియాళ్వార్ | తిరుప్పల్లాండు; పెరియాళ్వార్ తిరుమొళి; |
| 8. తొండరడిప్పొడియాళ్వార్ | తిరుప్పళ్లి యెళుచ్చి; తిరుమాలై; |
| 9. తిరుప్పాణాళ్వార్ | అమలనాదిపిరాన్ |
| 10. తిరుమంగైయాళ్వార్ | పెరియ తిరుమొళి; తిరుక్కురుం దాండగమ్; తిరునెడుందాండగమ్; తిరువెళుకూత్తిరుక్కై; శిరియ తిరుమడల్; పెరియ తిరుమడల్; |
| 11. ఆండాళ్ | తిరుప్పావై; నాయ్చ్చియార్ తిరుమొళి; |
| 12. మధురకవియాళ్వార్ | కణ్ణినుణ్ శిరుత్తాంబు |

మొత్తము పన్నిద్దరాళ్వార్లు అనుగ్రహించిన దివ్యప్రబంధములు ఇరువదినాలుగు. ఇవే నాలాయిరములు. ఇందలి మూడు ప్రబంధముల కూర్పే ఈ 'దివ్యప్రబంధత్రయి'.

నేడు మఠాధిపతులకును ఆదర్శముగ వెలుగుచు, శాశ్వత పురుషార్థ ప్రక్రియలను ఆచార ప్రచారములతో నెలకొల్పుచు, ప్రపన్న జనులకు సంపూజ్య శరణ్యులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్స్వామివారు అవ్యాజానుగ్రహముతో మంగళాశాసనమును కృపజేసినారు. వారి పాదారవిందములకు దానుఁడు శతకోటి అభివందనములు సమర్పిస్తున్నాడు.

ఏడేండ్లనుండి అముద్రితముగా ఉన్న ఈ "దివ్యప్రబంధత్రయి"ని నేడు శ్రీమాలోల గ్రంథమాల, శ్రీ అహోబిల మఠం, హైదరాబాద్ (ఆం.ప్ర.) వారు ప్రచురించి, ప్రకాశింపజేసినారు. శ్రీ అహోబిలమఠం కార్యవర్గ సభ్యులందరికిని అభినందన మందారసుమహారములు.

ఈ ప్రబంధమును, చక్కగా ముద్రించిన 'సరస్వతీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్' అధినేతలగు శ్రీ వాసుదేవ, శ్రీధర నామ సోదరులను శ్రీ మాలోల నృసింహస్వామి అభ్యుదయ పరంపరగా కటాక్షించుగాక.

ఈ 'దివ్యప్రబంధత్రయి'ని తగిన వెలకు కొని, అర్థతాత్పర్యములను తెలుసుకొని, నిత్యం అనుసంధించు భక్తబృందమునకు సర్వేశ్వరుడు సకల పురుషార్థములను ప్రసాదించుగాక.

చిత్రభానుచైత్రం
మే, 2002
ఇంద్రకుటీర్
2-1-45 ఫ్లాట్ 101
నల్లకుంట, హైదరాబాద్-44.

భాగవతవిధేయుడు,
**కే.వి. రాఘవాచార్యులు**



# దివ్య ప్రబంధత్రయ

1. తిరుప్పల్లాణ్డు

2. తిరుప్పళ్ళి యెళుచ్చి

3. కణ్ణినున్ శిఱుత్తామ్బు

ఆంధ్ర టీకాతాత్పర్యసహితమ్

శ్రీమతే రామానుజాయనమః

# I. శ్రీ పెరియాళ్వార్ల వైభవము (తిరుప్పల్లాణ్డు)

మిథునే స్వాతిజం విష్ణోరథాంశం ధన్వినః పురే।
ప్రపద్యేశ్వశురం విష్ణోః విష్ణుచిత్తం పురశ్శిఖమ్॥

శ్రీ విల్లి పుత్తూర్ నగరమున పురశ్చాదులగు శ్రీ వైష్ణవుల వంశమందు శ్రీ పెయాళ్వార్లు కలియుగాది 47వ దగు క్రోధననామ సంవత్సరమున మిధున మాన శుక్ల ఏకాదశీ తిథి, భానువారమునాడు స్వాతీనక్షత్రమందు శ్రీ గరుడాంశజులై శ్రీ ముకుందాచార్యుల వారి ధర్మపత్ని యగు 'పద్మెయార్' గర్భమందు ఉద్భవించినారు.

శ్రీ పెరెయాళ్వార్ల తిరునామములు: 1. శ్రీవిష్ణుచిత్తులు 2. శ్రీ భట్టనాథులు పెరియాళ్వార్లు, వడ పెరుంకోయిల్ అను దివ్వసన్నిధిలో శ్రీ వటపత్రశాయి యగు పెరుమాళ్ళకు నిత్యము తులసీ పుష్పమాలా కైంకర్యము చేయుచుండెడివారు.

దక్షిణ మధుర నేలుచున్న పరమధార్మికుడగు శ్రీ వల్లభదేవునికి ఆముష్మికమగు సద్గతిని పొందు ఆలోచన కలిగెను. తమ పురోహితుడగు శెల్వనంబి, సూచించిన రీతిగా రాజు పరతత్త్వనిర్ణయ సభ నేర్పరచి, అమూల్య ధనమును విద్యాశుల్కముగా ధ్వజస్తంభమున కట్టించినాడు.

వటపత్రశాయి యగు శ్రీ మన్నారాయణుడు పెరియాళ్వార్లకు స్వప్నమున సాక్షాత్కరించి "వల్లభదేవుడేర్పరచిన సభకు మీరుపోయి, వాదించి, నారాయణుడే పరతత్త్వము, అని చాటి చెప్పి అబహుమానమును సంపాదించుకొనండి. మీకు విద్యా గంధము లేదని సందేహించకండి. మీ జిహ్వాగ్రమున నిల్చి పరతత్త్వమును అవిష్కరించువాడను నేనే. మీరు

నిమిత్తమాత్రులై సభకుపోయిరండి" అని ఆజ్ఞాపించినాడు.

సర్వేశ్వరుని యానతిని తలదాల్చి పెరియాళ్వార్లు ఆ సభకు వెళ్ళినారు. ఆ మహారాజు, అధికారులు వీరికి ఎదురేగి, ప్రణామ పూర్వకముగా గౌరవించి సభలోనికి ఆహ్వానించినారు. అశేషవిద్వజ్జనుల సభలో ఆళ్వార్లు భగవదావేశముచే అనర్గళముగా వాదించిరి. వేదవేదాన్తాది ప్రమాణములను ప్రతిపాదించి, శ్రీ మన్నారాయణుడే పరతత్త్వము, అను విషయమును నిరూపించగా ఆ విద్యాశుల్కము తెగి ఆళ్వార్ల పాదములముందు పడినది. అందరు ఆశ్చర్యచకితులైన ఆళ్వార్ల నిర్ణయమును శిరసావహించినారు.

మహానందభరితుడైన రాజు పెరియాళ్వార్లను సముచితంగా సమ్మానించి, గజారూఢుని గావించి నగరవీధులలో ఊరేగింపు జరిపించినారు. ఈ బ్రహ్మరథోత్సవమును చూచుటకై లక్ష్మీనాథుడు సపరివారముగా వచ్చి, ఆకాశమున సాక్షాత్కరించి ఆళ్వార్లను అభినందించినాడు. అతిసుకుమార మనస్కులైన పెరియాళ్వార్లు భగవంతుని దర్శనము కాగానే భక్తి పారవశ్యముచే, ఈ క్షుద్రప్రపంచమునకు వేంచేసిన ఆదివ్యమంగళ విగ్రహమునకు, ఆ సౌందర్యరాశికి ఏ విధమైన అపాయము కలుగకుండునట్లు, ఏనుగు మెడలోని గంటలను చేతులతో పట్టుకొని మ్రోగించుచు, ఆశువుగా 'తిరుప్పల్లాణ్డు'ను పాడుచు మంగళాశాసనము చేసినారు, లోకోపకారుకులైనారు.

శ్రీ

శ్రియః పతయేనమః

ఆళ్వార్ ఎంబెరుమానార్ జీయర్ తిరువడిగళే

శరణమ్

# తిరుప్పల్లాండు: (టీకాతాత్పర్యసహితమ్)

శ్రీమన్నిగమాన్త మహాదేశికాయ నమః

రామానుజదయాపాత్రం, జ్ఞానవైరాగ్య భూషణమ్ ।
శ్రీమద్వేంకటనాథార్యం వందే వేదాన్త దేశికమ్ ॥

శ్రీశైలేశదయాపాత్రం, ధీభక్త్యాది గుణార్ణవమ్।
యతీంద్రప్రవణం వందే, రమ్యజామాతరంమునిమ్॥

లక్ష్మీనాథ సమారంభాం, నాథయామునమధ్యమామ్।
అస్మదాచార్య పర్యంతాం, వందేగురు పరంపరామ్॥

యోనిత్యమచ్యుత పదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహతస్తది తరాణితృణాయమేనే।
అస్మత్ గురోర్భగవతో ఽ స్యదయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥

మాతాపితాయువతయస్తనయావిభూతిః
సర్వంయదేవనియమేన మదన్వయానామ్।
అద్యస్యనః కులపతేర్వకుళాభిరామం
శ్రీమత్త దంఘ్రియుగళం ప్రణమామిమూర్ధ్నా॥

భూతంసరస్య మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహన్।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్।
శ్రీ మత్పరాంకుశమునిం ప్రణతో ఽస్మినిత్యమ్॥

తిరుప్పల్లాండు 'తనియ'లు:-
గురుముఖ మనధీత్యప్రాహవేదానశేషాన్
నరపతి పరిక్లుప్తం శుల్కమాదాతుకామః।
శ్వశురమమర వంద్యం రంగనాథస్య సాక్షాత్
ద్విజకుల తిలకంతం విష్ణుచిత్తంనమామి॥

అర్థం:- యః=ఏ విష్ణుచిత్తుడు; నరపతి, పరిక్లుప్తం=(వల్లభదేవుడను) రాజుచే. ఏర్పరచబడిన; శుల్కం=బహుమాన ద్రవ్యరాశిని, ఆదాతుకామః= గ్రహింప తలంపుగల వాడై; గురుముఖం=ఆచార్యుని ద్వారా; అనధీత్య=అభ్యసింపకయే; అశేషాన్= సమస్తమైన; వేదాన్=వేదములను; ప్రాహ=ఉపన్యసించెనో; తం=అట్టి, రంగనా థస్య=శ్రీరంగనాథునికి; సాక్షాత్=ప్రత్యక్షముగా;

శ్వశురం=మామగారైన; అమరవంద్యం=దేవతలచేతను సేవింపదగిన; ద్విజకుల తిలకం= బ్రాహ్మణజాతికి అలంకార భూతుడైన; విష్ణుచిత్తం=విష్ణుచిత్తుని గూర్చి; నమామి =నమస్కరించు చున్నాను.

**తా॥** దక్షిణ భారతదేశమున 'మధుర' పట్టణమును రాజధానిగా, పాండ్యదేశమునకు ప్రభువైన వల్లభదేవరాయలు పరతత్వ నిర్ణయమునకై చేసిన సభయందు గెలిచిన వారికి విద్యాశుల్కమైన వరహాల మూటను ఏర్పాటు చేసెను. శ్రీ విష్ణుచిత్తులు గురు సన్నిధిలో ఏ వేదమును గానీ, శాస్త్రమును గానీ అభ్యసింపలేదు. అయినను శ్రియఃపతి యాజ్ఞచే ఆ రాజ సభకు వేంచేసిరి. అచ్చట భగవత్కటాక్షము వలన పరతత్వనిర్ణయమునకు కావలసిన వేదశాస్త్ర ప్రమాణములనన్నిటిని ఉపన్యసించి, విజయులై, విద్యాశుల్కమును స్వీకరించిరి. తర్వాత తమ పుత్రికయైన శ్రీగోదాదేవిని శ్రీరంగనాథునకు సమర్పించి వారికి మామగారైరి. సమస్తదేవతలకును సేవ్యులై, బ్రాహ్మణకుల ఆభరణులైన శ్రీవిష్ణుచిత్త దివ్యసూరులకు నమస్కరించుచున్నాను.

**వివరణ:-** ఈ 'తనియ'ను కృపజేసిన వారు శ్రీమన్నాథమునులు. దివ్య ప్రబంధములను అనుసంధించుటకు ముందు వాటిని అనుగ్రహించిన వారి వైభవమును కీర్తించి, వారికి ప్రణతులర్పించే శ్లోకమును 'తనియ' అందురు.

సర్వదా తమ చిత్తమున శ్రీవిష్ణువును నెలకొలిపి, బ్రహ్మనిష్ఠాగరిష్ఠులైన శ్రీపెరియాళ్వారులకు 'విష్ణుచిత్త' నామధేయము వ్యవహృతమగుట సంస్కృత భాషా భాగధేయము.

పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తి ప్రపూర్ణులై 'పల్లాండు' పాడుటయే-మంగళాశాసనము చేయుటయే-కాక, 'అండాళు' పాణిగ్రహణ మహోత్సవమున శ్రీరంగనాథ స్వామిని-పెరియపెరిమాళ్ళను-'జామాత'గా బడసిన మహా భాగ్య వంతు లైన 'భట్టనాథులు',- 'పెరియాళ్వారు' లని పెద్దపేరుగాంచిరి.

(పాండ్యభట్టరు సాయించినవి)

**మిన్నార్ తడమదిళ్శూళ్, విల్లిపుత్తూరెన్నొరుకాల్,**

**శొన్నార్కళఱ్కమలం శూడినోమ్ - మున్నాళ్,**

**కిళియఱుత్తా నెన్నురైత్తోమ్, కీళ్మైయినిల్ శేరుం,**

**వళి యఱుత్తోమ్ నెంజమే! వందు॥**

**అర్థం**:- నెంజమే=ఓమనసా! వందు= (నీవు అనుకూలించుటచే ధ్యానదశకు) వచ్చి; మిన్=ప్రకాశముతో; ఆర్=నిండిన; తడం=విశాలములైన; మదిళ్=ప్రాకారములచే; శూళ్=చుట్టుకొనబడియున్న; 'విల్లిపుత్తూర్,- ఎన్ను=శ్రీవిల్లిపుత్తూరు;-అని, ఒరుకాల్=ఒక్కసారి; శొన్నార్=ఉచ్చరించిన వారి యొక్క; కళల్, కమలం= పాద పద్మములను; శూడినోమ్=శిరసావహించితిమి. మున్నాళ్=పూర్వకాలమున; కిళి = మూటను; అఱుత్తాన్ = తెగిపడునటులజేసెను; ఎన్ను=అని; ఉరైత్తోమ్ = అనుసంధించితిమి. కీళ్మైయినిల్=అధోగతియందు; శేరుం=చేరునట్టి; వళి=(ధూమాది) మార్గమును; అఱుత్తోమ్=ఛేదించితిమి-నిరోధించితిమి.

**తా॥** ఓ మనసా! నీవు అనుకూలించు భాగ్యమును పొంది, ప్రకాశపరిపూర్ణములైన పెద్ద పెద్ద ప్రాకారములచే పరివృతములైన, శ్రీవిల్లిపుత్తూరు,ను - 'జన్మకర్మచమేదివ్యం ఏవంయో వేత్తి తత్వతః' అన్నట్లు జన్మస్థాన కర్మాదులను తెలిసికొని చెప్పునట్టి,- మూడక్షరములు గల ప్రణవమువలె; శ్రీవటపత్రశాయి, పెరియాళ్వార్లు, ఆండాళు, అను ముగ్గురు కూడియున్న దివ్యదేశనామ మాహాత్మ్యమును-ఒక్క పర్యాయమైనను చెప్పుకొను భాగవతోత్తముల దివ్యపాదారవిందములను శిరోభూషణములుగా ధరించితిమి. పూర్వము పాండ్యరాజ సభలో జయస్తంభము చివర గట్టిన విద్యాశుల్కపుమూట, శ్రీమన్నారాయణుడే పరతత్త్వమను సిద్ధాంతమును స్థాపించిన శ్రీ పెరియాళ్వార్ల

పాదపద్మములకడ తనంతతానే తెగిపడగా, దానిని స్వీకరించిన వారి అద్భుత ప్రభావమును నోరార కీర్తించితిమి. తత్ఫలితముగా, పెరియాళ్వార్ల సంబంధము గలవారమై అధోగతికి హేతువైన ధూమాదిమార్గములను తెగగొట్టితిమి. పెదదారిలో నడిచి చెడిపోకుండా తరించకలుగు చున్నాము.

**పాండియన్ కొండాడప్పట్టర్ పిరాన్ వందానెన్ఱు,**
**ఈండియ శంగ మెడుత్తూద,**
**వేండియ వేదంగ ళోది విరైందు కిళియఱుత్తాన్,**
**పాదంగళ్ యాముడైయ పత్తు॥**

**అర్థం:-** పట్టర్ పిరాన్=ద్విజకుల తిలకులైన శ్రీభట్టనాథులు; వందాన్=వేంచేసిరి; ఎన్ఱు=అని, పాండియన్=పాండ్యదేశాధిపతి; కొండాడ=కొనియాడగా; ఈండియ=అనేకములైన; శంగం=జయ శంఖములను; ఎడుత్తు=(చేతులతో) ఎత్తిపట్టి; ఊద=నోటితో పూరింపగా; (ఈండియ=గుంపుగాచేరిన; శంగం=పండిత సంఘము; ఎడుత్తు=చేతులెత్తి, బ్రహ్మరుద్రాదులే పరదైవములనెడు వేదవాక్యములను ఎత్తి; ఊద=ఉదాహరింపగా;) వేండియ=అవశ్యకములైన; వేదంగళ్=వేదములను; ఓది=ఉపన్యసించి; విరైందు=శీఘ్రముగా; కిళి=మూటను; అఱుత్తాన్=తెగిపడునటుల జేసిన పెరియాళ్వార్ల యొక్క; పాదంగళ్= పాదములు; యామ్, ఉడైయ=మనకుగల; పత్తు=పట్టు,-దిక్కు-రక్షకము.

**తా॥** 'పరతత్త్వనిర్ణేతలు, బ్రాహ్మణోత్తములైన శ్రీ పెరియాళ్వారులు సభకు వేంచేసిరి'అని పాండ్యరాజైన వల్లభరాయుడు ఆనందముతో ప్రశంసింపగా, అనేకులు జయశంఖములను దిక్కులు పిక్కటిల్ల పూరించిరి. సంఘీభూతమైన

పండితమండలి వేదముల నుండి బ్రహ్మరుద్రాది పరములైన వాక్యములనెత్తి వాదించగా,శ్రీ పెరియాళ్వార్లు విష్ణుపారమ్య సంస్థాపనమున కవసరములైన అనేక వేదాంత వాక్యప్రమాణములను ఏకధారగా ఉపన్యసించి, నదన్యుల నాశ్చర్యచకితుల జేసిరి. త్రుటికాలముననే పందెపుమూటను తమ కాళ్ళకడ స్వయముగా వచ్చి పడునటుల జేసిన మహామహిమాన్వితులగు శ్రీ పెరియాళ్వార్ల దివ్య చరణకమల యుగళమే మనకు పెన్నిధి-శరణ్యము.

## పెరియాళ్వార్ తిరువడిగళే శరణమ్

**1. పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు,**
**పలకోడి నూరాయిరమ్।**
**మల్లాండ తిండోళ్ మణివణ్ణా!ఉన్**
**శేవడి శెవ్వి తిరుక్కాప్పు!!**

**అర్థం:-** మల్=మల్లులను; ఆండ=జయించిన; తిణ్=దృఢమైన; **తోళ్**= బాహువులుగల; మణివణ్ణా=ఇంద్రనీలమణివలె ఉజ్జ్వలమైన శరీరవర్ణము కల ఓస్వామీ! పల్=అనేకములైన; ఆండు=సంవత్సరములు; పల్=పలు; ఆండు= ఏండ్లు; పల్=పలు; ఆయిరత్తు=వేలకొలది; ఆండు=ఏండ్లు; (అనేక బ్రహ్మకల్పములు). పల్=అనేకములైన; కోడి=కోట్లకొలదియైన; నూరు=నూర్లకొలది; ఆయిరం=వేలకొలది (ఏండ్లు). (కాలతత్త్వమున్నంత దాక) ఉన్=నీయొక్క; శే=ఎఱ్ఱని; అడి=పాదముల యొక్క; శెవ్వి=సౌందర్యమునకు; తిరుక్కాప్పు=శ్రీరక్ష (కలుగుగాత)

**తా॥** పెరియాళ్వార్లు సర్వేశ్వరునికి మంగళాశాసనము చేయుచున్నారు. బాహ్యప్రపంచములో చాణూరముష్టికులనెడు దుర్ధర్షులైన మల్లులను, అంతరంగములో అహంకారమమకారములనెడు దుర్దాంతులైన మల్లులను

అణచివేసి, ప్రపన్నజనమునకు అభయమొసగుచున్న దృఢమైన భజార్గళములచే విరాజిల్లుచు, ఆశ్రిత వాత్సల్యముచే పరిపూర్ణమైన మాణిక్య వర్ణ విభాసిత దివ్యమంగళ విగ్రహ విభూతిగల ఓ స్వామీ! మీకు అనవరతము మంగళమగు గాక. సర్వేశ్వరా! సర్వకాలము వర్థిల్లుము. సర్వరక్షకమైన మీ దివ్యారుణ రమణీయ చరణ నళిన సౌందర్య లక్ష్మికి కాలతత్త్వమున్నంత వరకు నిరవద్యమైన రక్షకలుగుగాత.

2. **అడియోమోడుం నిన్నోడుం, పిరివిన్ఱియాయిరం పల్లాండు.**
**వడివాయ్ నిన్ వలమార్పినిల్, వాళ్గిన్ఱమంగైయుంపల్లాండు.**
**వడివార్ శోది వలత్తుఱైయుం, శుడరాళియుం పల్లాండు.**
**పడైపోర్ పుక్కు ముళంగుం, అప్పాంచశన్నియముంపల్లాండే॥**

**అర్థం:-** అడియో మోడుం=దాసులమైన మాతోడను; నిన్నోడుం=సర్వశేషివైన నీతోడను; పిఱివు=ఎడబాటు; ఇన్ఱి=లేకుండ; ఆయిరం=వేలకొలది; పల్, ఆండు=పెక్కు ఏండ్లు; (నిత్యము సంబంధించి యుండుగాక.) వడివు, ఆయ్=అందమైన కాంతిగల ఆభరణరూపమై; నిన్=నీయొక్క; వల, మార్పినిల్=కుడి, వక్షఃస్థలమున; వాళ్గిన్ఱ= ఆనందముతో నిత్యవాసముచేయుచున్న; మంగైయుం=నిత్యయువతియైన శ్రీమహాలక్ష్మియు; పల్; ఆండు=అనేక వత్సరములు (వర్థిల్లుగాక). వడివు=సౌందర్యముతో; ఆర్=నిండిన; శోది=తేజస్సుగల; వలత్తు=కుడిదిక్కున; ఉఱైయుం = వసించుచున్న; శుడర్=ప్రకాశించు; ఆళియుం= చక్రముకూడ; పల్, ఆండు=నిత్యము విజయము చేసి యుండుగాక. పడై=సేనలయొక్క;

పోర్=యుద్ధమందు; పుక్కు=ప్రవేశించి; ముళంగు=ధ్వనించు; అప్పాంచశన్నియముం= ఆ పాంచజన్యమను శంఖము కూడ; పల్లాండే= వర్థిల్లుగాక.

**తా॥** దాసభూతులమైన మాకును స్వామివైన నీకును గల ఈ శేషశేషిసంబంధము సర్వదా వర్థిల్లుగాక. నీ దక్షిణ వక్షఃస్థలమున నిత్యము వసించుచు నీకు భోగ్యభూతురాలును, మాకు పురుషకారభూతురాలునైన శ్రీ మహాలక్ష్మీదేవియు నిచ్చలు వర్థిల్లుగాక. సుందరోజ్జ్వల తేజోరాశియై నీకుడి కెంగేలునవసించు చక్రమునకు, సేనాసహితమైన యుద్ధమున ప్రవేశించి ప్రళయాభీలారావముచే శత్రునిరసనక్షమమైన నీ పాంచజన్యమునకు నిత్యము జయముకలగుగాత.

**వివరణ:-** విష్ణుపారమ్య సిద్ధాంతస్థాపకులైన శ్రీ విష్ణు చిత్తదివ్యసూరికి, గజారోహణముతో ఊరేగింపు అతివైభవముగ జరుగుచుండగా గరుడవాహనుడై ప్రాకృత మండలమునకు వేంచేసిన శ్రియః పతిని సాక్షాత్తుగా సేవించుటవలన బ్రహ్మానందము కల్గెను. వెంటనే శ్రీపెరియాళ్వార్లు పరిపూర్ణ ప్రేమ పరవశులైనారు. ఆ ప్రాకృతమండలములో జనుల దృష్టిదోషము వలన ఏమి యాపద వచ్చునో, ఏమి కొఱతకలగునో యని వారికి భీతియేర్పడెను. అతి ప్రేమ పాపశంకియేకదా!

సర్వశేషియైన పురుషోత్తముని దివ్యశోభకు జయము, జయమని మంగళాశాననము చేసినారు ఆశ్రితులతో కూడియున్న పెరియాళ్వార్లు. 'పల్లాండు' అనగా 'మంగళాశాసన' మని వ్యవహృతము. వేదాధ్యయనమునకు ముందు 'ఓం' కారము అనుసంధింపబడునట్లే ద్రావిడ వేదాధ్యయనమునకు అరంభమున ఈ 'తిరుప్పల్లాండు' అను సంధింపబడును.

**మల్లాండతిణ్తోళ్:-** సమృద్ధికి హేతువైన శౌర్యవీర్యాది కల్యాణ గుణయోగమును తెలుపుచున్నది.

**మణివణ్ణా :-** దివ్యమంగళ విగ్రహ యోగమును చెప్పుచున్నది.

ఇక రెండవ పాశురమున-----

**విన్నోడుం:-** ఆకారవాచ్యుడైన సర్వేశ్వరుని,

**మంగైయుం:-** ఉకారవాచ్యురాలైన శ్రీ లక్ష్మీదేవిని,

**అడియోమోడుం:-** మకారవాచ్యులైన జీవాత్మలను, నిర్దేశించుటచే, ప్రణవార్థము ప్రకటితము. 'పల్లాండు' నమః శబ్దార్థమే.

ఆళియుం; పాంచశన్నియముం:- ఉభయవిభూతి యోగము నిర్దిష్టం.

ఈ రెండు పాశురములు అష్టాక్షరీ మంత్రార్థమును బోధించునందురు పెద్దలు.

**3. వాళాళ్ పట్టుని న్నీరుళ్ళీరేళ్, వందు మణ్ణుం మణముంకొణ్మిన్।**
**కూళాళ్ పట్టుని న్నీర్‌కళై, ఎంగళ్‌కుళు వినిల్ పుగుదలొట్టోమ్।**
**ఏళాళ్ కాలం పళిప్పిలోం, నాంగళి రాక్కదర్ వాళ్! ఇలంగై**
**పాళాగ పడైపొరుదానుక్కు; పల్లాండు కూఱుదుమే॥**

**అర్థం:-** వాళాళ్ పట్టు=ఆనందకరమైన దాస్యమును పొంది; నిన్నీర్= స్థిరముగా నిలిచిన వారై; ఉళ్ళీర్, ఏల్=ఉన్నచో; వందు=వచ్చి; మణ్ణుం= పుట్టమన్నును; మణముం=కల్యాణోత్సవనిర్వాహకత్వమును; కొణ్మిన్=స్వీకరించండి, కూళ్=కూటికై; ఆళ్‌పట్టు; దాస్యమును పొంది; నిన్నీర్ గళై=నిల్చియున్నవారిని; ఎంగళ్=మాయొక్క; కుళువినిల్=సంఘమునందు (గుంపులోనికి) పుగుదల్, ఒట్టోం=ప్రవేశింపనీయము. ఏళ్, ఆళ్‌కాలం= భూతభవిష్యద్వర్తమానములలో ఏడేసి (ఇరువదియొక్క) తరములనుండి; పళిప్పు, ఇలోం = దోషములులేని; నాంగళ్ =మేము; ఇరాక్కదర్= రక్కసులు, వాళ్=వర్ధిల్లుచున్న; ఇలంగై=లంకానగరము; ఆళ్=(అక్కడి) జనులును; పాళ్, ఆగ=పాడైపోవునటుల; పడై=(వానర) సైన్యమును కూర్చుకొని; పొరుదానుక్కు=యుద్ధము చేసినవానికి (శ్రీరామచంద్రునకు) పల్లాండు=జయ! విజయీభవ! అని, మంగళాశాసమును; కూఱుదుమే= చేయువార మగుచున్నాము.

**తా॥** భగవత్కైంకర్యాభిరుచిగల భాగవతోత్తములను తమతోపాటు మంగళాశాసనము చేయుటకై ఆహ్వానించుచున్నారు పెరియాళ్వార్లు. అనన్య ప్రయోజనులైన భగవత్ప్రాప్తికాములారా! భగవత్కైంకర్యరూపభోగభాగ్యమును స్థిరముగ పొందదలచితిరేని, పాలతో పాలు కలిసినట్లు మీరు మాగోష్ఠి లోన చేరండి. భగవదుత్సవమునకు అంగమైన అంకురార్పణ కై పుట్టమన్ను తెచ్చుటయందు -మృత్సంగ్రహణమందు; తిరుక్కల్యాణోత్సవ నిర్వాహక సంఘము నందును అన్వ యించి, శ్రియఃపతికి సకలవిధ సేవలను చేయండి. ఉదరపూరణార్థమైదాస్య వృత్తిని అభినయించు ప్రయోజనాంతర పరులను, మాగోష్ఠిలో చేరుటకు, సమ్మతింపము. మాకున్న ఉత్కర్షమే మనగా-మేము భగవద్దాసులము. తొలి ఏడుతరములు, మలి ఏడుతరములు, మధ్యన ఏడు తరములు- ఇరువదియొక తరములు తరబడిగ, దేవతాంతర, మంత్రాంతర, సాధనాంతరాది దోషము లేమియు లేని వారము. శ్రియఃపతికి మంగళాశాసనము చేయుట మావృత్తి. రావణాదులనుదునిమి లంకానగరము పాడుపడునట్లు యుద్ధమొనర్చిన శ్రీరామచంద్రస్వామి, మా వృత్తికి కలిగెడు ఆటంకములను నివారించునన్న అధ్యవసాయముకలవారము. కాబట్టి, స్వామికి మంగళము పాడుటకు ప్రాప్తాధికారులందఱు వేంచేయండి.

4. **ఏడునిలత్తి లిడువదన్మున్నం, వందు ఎంగళ్ కుళాంపుగుందు।**
**కూడుమనముడైయార్ గళ్ , వరంబొళి వందొల్లైక్కూడు మినో**
**నాడు నగరమునన్నరియ, నమోనారాయణాయ వెన్ఱు।**
**పాడు మనముడై ప్పత్తరుళ్ళీర్, వందు పల్లాణ్డుకూఱుమినే॥**

**అర్థం:-** ఏడునిలత్తిల్=మూలప్రకృతియందు; ఇడువదన్=(స్థూలసూక్ష్మరూపమైన శరీరమును) విడుచుటకు; మున్నం=ముందే; వందు=వచ్చి; ఎంగళ్=మాయొక్క; కుళాం=గుంపులో; పుగుందు=ప్రవేశించి;

కూడు=కూడియుండుటకు; మనం=మనుస్సు, (ఆశ) ఉడైయార్‌గళ్=కలవారైన యెడల; వరంబు= (స్వాత్మానుభవమనెడి) కోరికను; ఒళి=విడిచి; వందు=(భగవంతుని సేవించుటకై) వచ్చి; ఒల్లై=త్వరగా; కూడుమినో=కూడియుండండి. నాడు=పల్లె; నగరముం =పట్టణ(ము) వాసులును; నన్గు=బాగుగా; అఱియ=ఎఱుగునట్లు; 'నమోనారాయణాయ' ఎన్ఱు=అని; పాడు=గానముచేయుటకు; మనం=మనస్సు; ఉడై=కలిగి; పత్తర్, ఉళ్ళీర్=భక్తి నిష్ఠులైనచో; వందు=వచ్చి; పల్లాండు=మంగళా శాసనమును; కూఱుమినే=చేయండి.

**తా॥** 'ఏకస్వాదునభుంజీత'- 'మధురవస్తువును ఒక్కడే భుజింపకూడదు' అన్నట్లు, స్వజాతీయులతోనే తృప్తి పడక, చతుర్విధాభజంతే మాం. 'భగవానుడే తనను భజించు వారు నాలుగు రీతులవారు' అని చెప్పినందునను, పెరియాళ్వార్లు ఈ పాశురమున కైవల్యార్థులను కూడ ఆహ్వానించుచున్నారు:-

'కైవల్యార్థులు' - అనగా, శరీరపతనానంతరము తిరిగి సంసారములోకి రాలేక, అటు అర్చిరాది మార్గమున వైకుంఠమునకు చేరి భగవంతునికి సేవ చేయనోచుకోక, కరువు కాటకాలలో ఆకలి మంటచే తనను తానే పీక్కొని తినురీతిగా, - తన ఆత్మానుభవమును మాత్రమే శాశ్వతముగా పొందెడి జీవులు. వీరుక్షుద్రపురుషార్థ పరులుగా పరిగణింపబడుదురు. దూరపుబంధువుల వంటివారు- అనిజాలికల్గినది.

ఓ కైవల్యోపాసకులారా! మీరు కైవల్యస్థానమున ప్రవేశింపక మున్నే స్వాత్మానుభవమనెడి క్షుద్రఫలాపేక్షను త్యజించి, భగవద్దాసులమైన మాగోష్ఠిలో చేరండి. పామరులు, పండితులు చక్కగా తెలిసికొని ఉజ్జీవించునటుల, తిరుమంత్రోపదేశమును పొంది, శ్రీ మన్నారాయణుని కీర్తింపభక్తి నిష్ఠులగుదురేని, వచ్చి, మాతో పాటు భగవంతునికి మంగళగానము చేయండి

5. **అండక్కులత్తుక్కది పతియాకి, అశురరిరాక్కదరై।**
**ఇండక్కులత్తై యెడుత్తుక్కళైంద, ఇరుడీకేశందనక్కు।**
**తొండక్కులత్తిలుళ్ళీర్, వందడి తొళు దాయిర నామంశొల్లి।**
**పండైకులత్తై త్తవిర్న్దు, పల్లాండు పల్లాయిరత్తాండెన్మినే॥**

**అర్థం**:-అండక్కులత్తుక్కు=బ్రహ్మాండసముదాయమునకు; అదిపతి=నాయకుడు; ఆకి=అయ్యి; అశురర్=అసురులయొక్క, ఇరాక్కదరై=రాక్షసుల యొక్కయు, ఇండక్కుల త్తై=నీచులసమూహమును; ఎడుత్తు=ఎత్తి; కళైంద=నశింపజేసిన; ఇరుడీకేశన్ తనక్కు=హృషీకేశునికి; తొండక్కులత్తిల్, ఉళ్ళీర్=దాసుల వర్గము నందున్న, మీరు; పండై=పాతదైన; కులత్తై=స్వరూప స్వభావాలను; తవిర్ందు; మానుకొని; వందు=వచ్చి; అడి=శ్రీపాదములను; తొళుదు=సేవించి;అయిర నామం=వేయిపేర్లను; శొల్లి=అను సంధించి; పల్లాండు, పల్లాయి రత్తాండు, ఎన్మినే=పెక్కువేల యేండ్లు వర్ధిల్లుగాక, అని పాడండి.

**తా॥** పెరియాళ్వార్లు ఇందు ఐశ్వర్యార్థులను పిలుచుచున్నారు:- పోయిన సొమ్ముకోసము - కొత్త సొమ్మును పొందుటకు (రెండు రకాలవారును) భగవంతుని ప్రార్థించువారు ఐశ్వర్యార్థులు. వీరేనాటికైనను విరక్తిజెంది మోక్షమునపేక్షించ వచ్చును.

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడై ముక్కడులైన రక్కసుల నుక్కడగించిన హృషీకేశునికి (స్వరూపమునకు తగినట్లు ఇంద్రియముల నియమించు స్వామికి) నిరంతర కైంకర్యము చేయు కులమునందు ఉదయించిన ఓ ఐశ్వర్యకాముకులారా! మీరు 'నేను-నాది': అను ప్రాచీన విధానమును మార్చుకొని మాగోష్ఠిలో ప్రవేశించండి. శ్రియఃపతి పాదారవిందములను సేవించి, సహస్రనామములను పఠించి, అనన్యచింతనులై

భగవంతునికి మంగళాశాసనము చేయ వేంచేయండి.

**6. ఎందైతందైతందై, తందైతమ్మూత్తప్పన్, ఏళ్‌పడి కాల్‌తొడంగి।
వందువళి వళియాళ్‌శెయ్‌గిన్ఱోం, తిరువోణత్తిరువిళవిల్।
అందియం పోది లరియురువాగి, యరియై యళిత్తవనై।
పందనైతీరప్పల్లాండు, పల్లాయిరత్తాండెన్ఱుపాడుదుమే॥**

**అర్థం:-** ఎందై=నేను, నాతండ్రి; తందై=అతని తండ్రి; తందై=ఆయనతండ్రి; తందై=ఆయన తండ్రి; తమ్మూత్తప్పన్= ఆయన తండ్రి, తాతయు; ఏళ్=ఏడు; వడికాల్=తరములు, తొడంగి=మొదలుకొని; వందు=వచ్చి; వళి, వళి=పరంపరగా; ఆళ్=దాన్యమును; శెయ్‌గిన్ఱోమ్=చేయుచున్నాము. తిరుఓణత్తిరువిళవిల్=శ్రవణా నక్షత్రోత్సవమునందు; అందియం, పోదిల్=నంజపాద్దన; అరి ఉరు ఆగి=నృసింహ స్వరూపుడై; అరియై=(ఆశ్రితునికి) శత్రువైన హిరణ్యాసురుని; అళిత్తవనై= సంహరించిన వానిని; పందనై=(ఆయన) ఆయాసము; తీర=తీరునట్లు; పల్లాండు, పల్లాయిరత్తాండు=కాలతత్త్వమున్నంతవరకు వర్ధిల్ల వలెను; ఎన్ఱు=అని; పాడుదమే=మంగళ గానము చేయుదుముగాక.

**తా॥** వాళాల్, పాశురమున ఆహ్వానింపబడిన భగవత్ప్రాప్తికాములు తమ యోగ్యతను చెప్పుకొనుచు వచ్చి, పెరియాళ్వార్లగోష్ఠిలో చేరినారు. (మంగళాశాసనము చేయుట ఆగిపోయినచో శ్రీవైష్ణవత్వమునకు హానికలుగును. కాబట్టి, ఏడు తరముల నుండి వంశపరంపరగా భగవత్కైంకర్యమును అవిచ్ఛిన్నముగ కొనసాగించుచున్నామని చెప్పుట ఆత్మశ్లాఘకాదు. పెరియాళ్వార్ల మనస్సున కలిగిన భయమును నివారించుట అత్యావశ్యకము కదా!)

శ్రవణా నక్షత్ర మహోత్సవమున, దేవతలకు బలము క్షీణించి, అసురులకు బలము వృద్ధిబొందు సంధ్యా సమయములో భాగవతాగ్రగణ్యుడైన ప్రహ్లాదునికి విరోధియగు హిరణ్యకశిపుని చీల్చి చెండాడిన శ్రీ నరసింహస్వామికి అరిష్టములు కల్గకుండ, బడలికసడలు నటుల అనవరతము వర్ధిల్లుదువుగాక- అని పల్లాణ్డుపాడుటయే మనకు ఉజ్జీవనము.

**7. తీయిఱ్పొలిగిన్ఱ శెంజుడరాళి, తిగళ్ తిరుచ్చక్కరత్తిన్।**
**కోయిఱ్పొఱి యాలేయొత్తుండునిన్ఱు, కుడికుడియాళ్ శెయ్‌గిన్ఱోమ్।**
**మాయప్పొరు పడైవాణనై, ఆయిరంతోళుంపొళికురుది-**
**పాయ; శుళత్తియవాళి వల్లానుక్కు; పల్లాండు కూఱుదుమే॥**

**అర్థం:-** తీయిల్=తేజః పదార్థములన్నిటి కన్న; పొలిగిన్ఱ=మిక్కిలి ప్రకాశించుచున్న; శెం=ఎఱ్ఱని; శుడర్=కాంతిగల, ఆళి=గుండ్రమైన; తిగళ్=తేజస్సుగల; తిరుచ్చక్కరత్తిన్ =శ్రీ సుదర్శనము యొక్క; కోయిల్=వర్తులాకారముగల వానస్థానము యొక్క; పొఱియాలే= చిహ్నముచేత; ఒత్తుండునిన్ఱు=(భుజములందు) అంకితులమైయుండి; కుడి, కుడి=వంశక్రమముగా, ఆళ్,శెయ్‌గిన్ఱోమ్=దాస్యము జేయుచున్నాము. మాయ,పొరు, పడై=కృత్రిమ, యుద్ధముజేయు, సైన్యముగల= వాణనై =బాణాసురునియొక్క; ఆయిరం=వేయి; తోళుం=భుజములనుండి; పొళి=స్రవించుచున్న; కురుది=రక్తము; పాయ=వెల్లువలై పాఱునట్లు; శుళత్తియ= చుట్టు ప్రజ్వరిల్లెడు; ఆళి=శ్రీసుదర్శనమును; వల్లానుక్కు= నియమించు సామర్థ్యముగల స్వామికి; పల్లాణ్డు=మంగళాశాసనమును; కూఱుదుమే = కూర్తుముగాక

**తా॥** 'ఏడునిలత్తిల్', పాశురమున పిలువబడిన కైవల్యార్థులు క్షుద్రమైన తమ

ఉపాసనను విడిచి పెట్టి, తమకత్యంతవర్చస్సు కలిగించి తమను శ్రీవైష్ణవగోష్ఠిలో ప్రవేశింపజేసిన శ్రీ సుదర్శన భగవానుని ఉపకారమును స్తుతించుచు వచ్చి చేరి నారీ పాశురములో:-

సూర్యాగ్నిచంద్రుల కన్న అధికలోహిత జ్యోతిస్స్వరూపముతో జాజ్వల్యమానుడై, నీలమేఘనిభమగు సర్వేశ్వరుని దివ్యమంగళ విగ్రహమునకు కడు ప్రకాశకరుడైన శ్రీసుదర్శన భగవానుడు నివసించు స్థానమైన మండలాకార ముద్రచే చిహ్నిత భుజులమై, అనాదిగా మా నంతతివారమందరము వంశపరంపరగా-భగవంతునికి సేవచేయగలుగు చున్నాము.

తప్త చక్రాంకితుడు కానందున, మాయాయుద్ధకుశలు రైన భటులగల బాణాసురుని సహస్రబాహువులను ఛేదించి రక్తపు టేరులను ప్రవహింపజేసిన శ్రీసుదర్శన దివ్యసూరిని నియమించు శక్తి గల చక్రధరునకు పల్లాండు పాడుటయే పరమ ప్రయోజనము.

**వివరణ:-** వైకుంఠనాథుడు "చక్రాంకితాః ప్రవేష్టవ్యాయావదాగమనం మమ" అని, నియమించినందున, తప్త చక్రాంకితులైనవారు సంసారసాగరములో పడక, మోక్షసామ్రాజ్యము ననుభవింతురు; సర్వేశ్వరుడు అంగీకరించుటకు యోగ్యులగుదురు. 'చక్రాంకన' మన్నప్పుడే శంఖ చక్రములను అర్థము స్ఫురించుట ప్రసిద్ధము.

పరమపదనాథునికి శంఖచక్రాదులు ఆయుధములు గను, అభరణములుగను ఉపయోగపడు స్వయంప్రకాశులైన దివ్యసూరులు.

బాణాసురుడు సహస్రబాహుడైనను, సాధనాంతర, దేవతాంతర పరుడగుటచే భంగపడక తప్పలేదు-అనుట పురాణప్రసిద్ధము.

**8. నెయ్యిడై నల్లదోర్‌శోఱుం, నియతము మత్తాణిచ్చేవగముమ్।**

**కైయడైక్కాయుం, కళుత్తుక్కు ప్పూణొడు, కాదుక్కుక్కుండలముమ్।**

**మెయ్యిడ నల్లదోర్ శాందముం, తందెన్నై వెళ్ళుయి రాక్కవల్ల**
**పై యుడైనాగప్పగై క్కొడియానుక్కు, పల్లాండుకూఱువనే॥**

**అర్థం** :- నెయ్,ఇడై=(సగము) నేతితోకూడిన, నల్లదు=శ్రేష్ఠమైన, ఓర్=ఒక విలక్షణమైన ; శోఱుం= అన్నమును; నియతముం=ఎల్లప్పుడును; అత్తాణి= ఎడబాటులేని; శేవగముం=సేవకవృత్తిని; కై=హస్తమునందు; అడైక్కాయుం= తాంబూలమును; కళుత్తుక్కు=కంఠమునకు; పూణ్ఒడు=ఆభరణముతోపాటు; కాదుక్కు=చెవులకు; కుండలముం = కుండలములను; మెయ్, యిడ = శరీరమున ధరించుటకు; నల్లదు= ఉత్కృష్టమైన ఓర్=ఒక విలక్షణమైన; శాందముం = చందనమును; తందు=ఇచ్చి; ఎన్నై=నన్ను; వెళ్, ఉయిర్= శుద్ధ ఆత్మనుగ; ఆక్కవల్ల=చేయసమర్థుడైన, పై, ఉడై=(విశాలమైన) పడగలుగల; నాగ= నర్పములకు; పగై=పగవాడైన గరుత్మంతుని; కొడియానుక్కు= ధ్వజముగా గలవానికి; పల్లాండు=మంగళాశాసనమును; కూఱువన్, ఏ=చేయుదును.

**తా॥** 'అండక్కులత్తు' పాశురమున ఆహూతులైన ఐశ్వర్యార్థులు, ఈ పాశురమున శ్రియఃపతియౌదార్యమును కొనియాడు, పెరియాళ్వార్ల వర్గములో చేరుచున్నారు.:-

సగమునెయ్యి, సగము అన్నము కలిసియున్న రసమయమైన మధురాహారమును, తాంబూలమును, కంఠహారమును, కర్ణా భరణములను, మైపూతకు శ్రీచందనమును, తామునశ్వరమగు ఐశ్వర్యమును అపేక్షించినను నా ఆశదీరునట్లు నాకు కృపచేసి నాడు శ్రియఃపతి. తన భక్తులకువలె నాకు కూడ తన దాస్యమును చేయుభాగ్యమును ప్రసాదించుటయే కాక, అనాది సంసార నిమగ్నుడనగునన్ను శుద్ధ సత్వస్వభావము కలవానిగా తీర్చి దిద్ది. భౌతిక సంపదలందు విరక్తిని, పారమార్థిక విషయములందు రక్తిని కలిగించిన

ఆగరుడధ్వజునికి నిత్యము మంగళాశాసనము చేయుటయే జీవ లక్షణము.

9. **ఉడుత్తుక్కళైంద నిన్ పీ తగవాడై, యుడుత్తుక్కలత్తదుండు।**
**తొడుత్తతుళాయ్మలర్ శూడిక్కళైందన, శూడుమి త్తొండర్ గళోమ్।**
**విడుత్త దిశైకరుమం తిరుత్తి, త్తిరువోణత్తిరువిళవిల్।**
**పడుత్త పైన్నాగణైప్పళ్ళికొండానుక్కు, పల్లాండుకూఱు దుమే**

**అర్థం:-** ఉడుత్తు=ధరించి; కళైంద= విడిచిన; నిన్=నీయొక్క; పీతగవాడై = పీతాంబరమును; ఉడుత్తు=ధరించి; కలత్తదు=పాత్రలో మిగిలిన ప్రసాదమును; ఉండు = స్వీకరించి (భుజించి) తొడుత్త = మాలికగా కట్టబడిన; తుళాయ్ = తులసీదళాలను; మలర్=పుష్పములను; శూడి=ధరించి; కళైందన= తీసివేసిన వాటిని, శూడుం=తలపై ధరించు; ఇత్తొండర్ గళోమ్=ఈ దాసుల మైన మేము, విడుత్త=ఆజ్ఞాపించిన; దిశై= దిక్కుల యందుకల; కరుమం= కార్యములను; తిరుత్తి=చక్కదిద్ది; తిరువోణం, తిరువిళవిల్=శ్రవణా నక్షత్ర, మహోత్సవమునందు; పడుత్త=పరచబడిన; పై=విశాల ఫణములుగల; నాగ, అణై=ఆదిశేషుని (పడక) యందు; పళ్ళికొండానుక్కు=పడుకొనిన స్వామికి; పల్లాండు, కూఱుదుమే=మంగళాశాసనము చేయుదుము.

**తా॥** 'వాళాల్' పాశురమున పిలువబడి, 'ఎన్నైతందై' లో ప్రవేశించిన వారితో- దేహ యాత్రయందును పారతంత్ర్యమే స్వరూపముగా గలవారితో -కలిసి మంగళాశాసనము చేయుచున్నారు ఆళ్వార్లు:-

ఓ పురుషోత్తమా! నీవు ధరించివిడిచిన దివ్యపీతాంబరమును మేము ధరించి, నీవు ఆరగించగా శేషించిన ప్రసాదమును స్వీకరించి, నీవు అలంకరించుకొనిన సుగంధభరిత శ్రీ తులసీ పుష్పమాలికలను తీసివేసిన పిమ్మట మేము శిరసా వహించెడు దాసులము. నీ వాజ్ఞాపించిన సర్వదిక్కుల యందు నిర్వహింపదగిన

కార్యములను చక్కగా నెరవేర్చెదము.భోగిభోగశయనీయశాయివైన ఓ శ్రియఃపతీ। శ్రవణా నక్షత్రమున అవతరించిన నీ మహోత్సవమునందు నీకు దృష్టి దోషము కలుగకుండ, తనివిదీర మంగళా శాసనము చేయుచున్నాము. జయ! విజయీభవ!!

10. ఎన్నాళెంబెరుమాన్, ఉన్దనక్కడియోమెన్ఱెళుత్తుప్పట్ట
వన్నాళే; అడియోంగళడిక్కుడిల్, వీడు పెత్తుయ్ందతుకాణ్।
శెన్నాళ్తోత్తిత్తిరుమదురైయుళ్, శిలైకునిత్తైందలైయ।
పైన్నాగత్తలైప్పాయ్ందవనే, ఉన్నైప్పల్లాండుక్కూఱుదుమే॥

**అర్థం**:- ఎంబెరుమాన్=మాస్వామీ! ఎన్నాళ్=ఏదినమున; ఉన్,తనక్కు=నీకు; అడియోమ్=దాసులము; ఎన్ఱు=అని; ఎళుత్తుప్పట్ట=వ్రాసి ఈయబడితిమో; అన్నాళే=ఆదినముననే; అడియోంగళ్=దాసులమైనమేము; అడిక్కుడిల్ = మావంశము వారందరమును; వీడుపెత్తు=(అహంకారమమకారములను) విడిచి పెట్టి; ఉయ్ందతుకాణ్ =ఉజ్జీవించితిమి,సుమా! శెంనాళ్=మంచిరోహిణీ నక్షత్రమున; తోత్తి=ఆవిర్భవించి; తిరుమదురైయిల్=శ్రీమధురయందు; శిలై=ధనుస్సును, కునిత్తు=వంచి; ఐందలైయ=ఐదుతలలుగల; పై=విశాలమైన పడగలుగల; నాగత్తలై=కాళింగుడనుపాముతలమీద; పాయ్ందవనే= దుమికినవాడా! ఉన్నై=నిన్నుగూర్చి; పల్లాండు, కూఱుదుమే=వర్ధిల్లుదువుగాక అని, మంగళాశాసనము చేయుచున్నాము.

**తా**॥ ఇందులో కైవల్యార్థులు, ఆశ్రయణ వేళలో క్షుద్రపురుషార్థము- స్వాత్మానుభవము - సవాసనముగా నశించిన రీతికి ఆశ్చర్యపడుచు, ఆళ్వార్లతో కలిసి భగవన్మంగళా శాసనమును చేయుచున్నారు.

ఓ సర్వశేషీ! శ్రియఃపతీ! ఈసంసారములో దాస్యము ప్రకాశించుట యే దుర్లభము. మీ అవ్యాజమైన అనుగ్రహమువలన స్వరూపజ్ఞానమును

పొందుటకు అనుకూల్యమేర్పడినది. ఏనాడు 'మేము శేషభూతులము', అని ఒడంబడిక పత్రము వ్రాసియిచ్చితిమో- (అనగా-పంచసంస్కారములను పొంది, తిరుమంత్రము యొక్క అర్ధమును అనునంధించుకొనుచు, అనుష్ఠించువారలమైతిమో) ఆనాటి నుండి మీకటాక్షము మీ సంబంధ సంబంధులవరకును వ్యాపించినది. మా (కుడిల్=గుడిసె)ఇంటిలో పుత్రపౌత్రాదులందరికి కైవల్య, ఐశ్వర్యముల యందలి కోరిక సమూలముగ నశించినది. ఉపకారముచేసి మరచే స్వభావము గల మీతో, ఉపకారమును పొంది మరవకుండ విన్నవించుకొనుటయే దాసులకు విధి కదా!

మీరు రోహిణీ నక్షత్రమున ఆవిర్భవించితిరి. మధురలో ధనుర్యాగమున విల్లును విఱిచితిరి. కంసాది శత్రువులను సంహరించితిరి. పంచశీర్ష ఫణామణిమండిత కాళియసర్పము తలపైన నృత్యముజేసి, మమతాహంకృతులను నశింపజేసిన స్వామీ! మీకు మంగళమగుగాక.

**11. అల్వాళక్కొన్నుమిల్లా, వణికోట్టియర్కోన్, అబిమానతుంగన్**
**శెల్వానైప్పోలత్తిరుమాలే, నాను మునక్కుప్పళ వడియేన్।**
**నల్వాగైయాల్ నమోనారాయణావెన్ను, నామంపలపరవి।**
**పల్వాగైయాలుం పవిత్తిరనే, ఉన్నైప్పల్లాండు కూఱువనే॥**

**అర్థం:-** తిరుమాలే=ఓ శ్రియః పతీ! అల్, వళక్కు=చెడ్డత్రోవలు; (దుష్టస్వభావము) ఒన్నుం=ఒక్కటియు; ఇల్లా=లేనివార్తై అణి=ఆభరణాయమానమైన; కోట్టియర్, కోన్=గోష్ఠీపురవానులకు, అధిపతియైన; అభిమాన, తుంగన్=శ్రీ వైష్ణవాభిమానముచే, ఉన్నతుడైన; శెల్వానై, పోల=శెల్వానంబి, వలె; నానుం=నేనుకూడ; ఉనక్కు=నీకు; పళ=పురాతనమైన; అడియేన్=దాసుడను; నల్=మంచి; వగైయాల్=పద్ధతిచే; (అర్థానుసంధానముచే) నమోనారాయణా;

ఎన్డు=తిరుమంత్రమును అనుసంధించి; పల=అనేకంగా ఉన్న; నామం=పేరును; పరవి=కీర్తించి; పల్, వగైయాలుం = అన్నివిధములచే; పవిత్తిరనే = పవిత్రుడవైన శ్రీనాథా! ఉన్నై = నిన్ను గురించి; పల్లాండు = మంగళాశాసనమును; కూఱువనే=చేయువాడను.

**తా॥** భగవచ్ఛరణార్థులు కేవలలు, ఐశ్వర్యకాములు అనెడు మూడు రకాలుగా ఉన్నవారిని కలుపుకొని శ్రీపెరియాళ్వార్లు, తానే సర్వేశ్వరునికి మంగళాశాసనమును చేయుచున్నారు:-

శ్రియః పతీ! నడవడిలో దోషలేశము లేని, తిరుక్కోట్టియూరివారికి నాయకుడై, వైష్ణవశ్రీతో విరాజమానుడై, జ్ఞాన భక్తివైరాగ్య పరిపూర్ణుడైన శ్రీ శెల్వనంబిగారు వలె, నేను కూడ పూర్వము నుండియు దాసుడనే సుమా! నీవే ఉపాయము; ఉపేయమును నీవే, అనుదృఢాధ్యవసాయము కలవాడను. అర్థముతో పాటు అష్టాక్షరీ మంత్రమును అనుసంధించుచు, నీ సహస్రనామములను సంకీర్తనము చేయుచు, పరమ పవిత్రుడవైన నీకు నిత్యము పల్లాండు, పల్లాండు-అని మంగళాశాసనము చేయుచున్నాను.

**వివరణ:-** వసుంధరాదేవికి అలంకారభూతమైన శ్రీగోష్ఠీపురములో నివసించువారందరికి స్వామియైన, స్వరూపప్రాప్తమైన గొప్ప ఐశ్వర్యముచే ఏ కొరత లేని వారు శ్రీశెల్వనంబిగారు.

దుష్టప్రవృత్తులు:-

1. దేహమును ఆత్మగాభ్రమించుట.
2. ఆత్మను స్వతంత్రమైన వస్తువుగా భావించుట;
3. దేవతాంతరములందు పరత్వబుద్ధినిలుపుట.
4. భగవత్సేవకు ఫలము ఇతర ప్రయోజనముండు ననుకొనుట.
5. భగవదనుభవమును తనదిగా తలంచుట.

ఇవి నడవడిలోని దోషములు, ఇందులో ఏ ఒక్కదోష గంధమంటని వారు శ్రీశెల్వనంబిగారు.

పురాతనదాసుడనగా-దేవదేవునికి శేషిత్వము అనాదియైనట్లే, జీవునికి, శేషత్వము అనాదియైనదనుట.

మధురానగరమహారాజైన శ్రీవల్లభదేవరాయులకు గురువు శ్రీశెల్వనంబి. పరమార్థము నందు సంపూర్ణ విశ్వాసము రాజుకు కలుగ వలెనని- విద్వత్సభనేర్పరచుమని రాజుకు సలహానిచ్చిన వారు శ్రీ శెల్వనంబిగారు.

**12. పల్లాండెన్ఱు పవిత్తిరనై, ప్పరమేట్టియై శార్ఙ్గమెన్నుమ్।**
**విల్లాండాందన్నై, విల్లిపుత్తూర్ విట్టుశిత్తన్ విరుంబియశొల్।**
**నల్లాండెన్ఱు నవి న్ఱురైప్పార్, నమోనారాయణాయవెన్ఱు।**
**పల్లాండుం పరమాత్మనై, చ్చూళ్ందిరుందేత్తువర్ పల్లాండే॥**

**అర్థం**:- పవిత్తిరనై=పావనుడైన; పరమేట్టియై=పరమేష్ఠియైన (పరమపదవాసుడైన) శార్ఙ్గం=(శృంగము చేత ఏర్పరచబడిన) శార్ఙ్గం; ఎన్నుం=అనెడి; విల్=ఏంటిని; (ధనుస్సు) ఆండాన్తన్నై=తన అధీనమందుంచుకొనిన సర్వేశ్వరుని; విల్లిపుత్తూర్=విల్లి పుత్తూరునందవతరించిన; విట్టుశిత్తన్=శ్రీవిష్ణుచిత్తులు; పల్లాండు, ఎన్ఱు = బహుసంవత్సరములు మంగళమగుగాక, అని; విరుంబియ = ప్రేమాతిశయముతో; శొల్ = చెప్పిన (ఈ ప్రబంధమును),నల్ = (అనుసంధించుటకు) మంచి; ఆండు=కాలము(లభించినది). ఎన్ఱు=అని; నవిన్ఱు =అనవరతము; ఉరైప్పార్=అనుసంధించువారు. 'నమోనారాయణాయ' -ఎన్ఱు='నమోనారాయణాయ'-అని, అనుకొనుచు; పల్లాండు= ఆచంద్రతారార్కము; పరమాత్మనై= శ్రీమన్నారాయణుని; శూళ్ందు= ప్రదక్షిణముచేయుచు; ఇరుందు= సన్నిధి యందుండి; పల్లాండు, ఏత్తువర్='పల్లాండు' అనుచు. స్తుతించుచుందురు.

తా॥ నిరవధిక ప్రేమ పరవశులైన శ్రీ పెరియాళ్వార్లు ఈ దివ్యప్రబంధమును గానము చేయు మహాభాగులకు ఫలశ్రుతిని అనుగ్రహించుచు, శ్రియః పతికి మంగళాశాసనము చేసినారు:-

సమస్త చేతనాచేతనములందు వ్యాపించియున్నను. ఏదోషమంటని పవిత్రుడు పరమపదనాధుడు ఆశ్రితులను రక్షించుశార్ఙ్గమను ధనుస్సును ధరించిన శ్రీమన్నారాయణునికి పరమైకాంతియైన శ్రీపెరియాళ్వార్లు 'పల్లాండు' పాడినట్టి ఈ పండ్రెండు పాశురములను 'మనకు అభ్యుదయ సమయము లభించినది కదా। అని, కొని యాడుచు, అనుసంధించు వారు, 'నమోనారాయణాయ' అనుచు అర్థానుసంధానముతో భగవత్సన్నిధిలో మంగళాశాసనము చేయు వారగుదురు.

కాలపరిణామములేని పరమ పదమునకు- నిత్యసంసారులైనను 'తిరుప్పల్లాండు'ను సర్వకాలము అనుసంధించువారు- వేంచేసి, నిత్యసూరులతో సమానులై-భగవంతుని సౌందర్య సౌకుమార్యాదులచే, (భగవంతునితో) ఎడబాటు కలుగునేమోయనుభయము కలవారై, యావదాత్మభావిగా, శ్రీమన్నారాయణునికి మంగళాశాసనము చేయుచుందురు.

పెరియాళ్వార్ తిరువడిగళే శరణమ్

# 2. శ్రీ తొండరడిప్పొడి యాళ్వార్ల వైభవము (తిరుప్పళ్ళియెళుచ్చి)

కోదండే జ్యేష్ఠ నక్షత్రే మండంగుడికులోద్భవమ్।
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణుమాశ్రయే॥

దక్షిణ భారతదేశమున కుంభకోణమునకు పడమర ఐదుకి.మీల దూరమున నున్న 'మండంగుడి' నగరమున శ్రీ తొండరడిప్పొడియాళ్వార్లు కలియుగాది 298వ దగు ప్రభవనామసంవత్సర మందు మార్గశిర (ధనుర్) మాసమున కృష్ణ చతుర్ధశి, మంగళవారము, జ్యేష్ఠా నక్షత్రమందు శ్రీ వైజయంతీ వనమాలాంశచే పురశ్చూడులగు శ్రీ వైష్ణవుల వంశమున అవతరించినారు. వీరి తండ్రి గారు వీరికికాలోచిత సంస్కారముల నొనరించిరి. వేదశాస్త్ర విద్యల నభ్యసింపజేసిరి. సద్గుణ సంపన్నులైన వీరు గృహస్థాశ్రమమును స్వీకరించియు జితేంద్రియులై శ్రీ రంగక్షేత్రమునకు వేంచేసినారు.

శ్రీరంగనాథుని-పెరియ పెరుమాళ్ళ-దివ్యరూప సౌందర్యములను సేవించిన తొండరడిప్పొడి యాళ్వార్లు పులకీకృత గాత్రులైనారు. కావేరీ తీరమున నందనవనమును కల్పించినారు. పెరియాళ్వార్లవలె వీరు శ్రీ రంగనాథస్వామికి ప్రతిదినము శ్రీ తులసీ పుష్పమాలా కైంకర్యమును చేయుచుండిరి.

ఒకనాడు నందనవనములోకి వచ్చిన దేవదేవియను వేశ్య యొక్క వల (పు)లో పడి, కొంతకాలము వర్ణాశ్రమధర్మములకు, భగవత్కైంకర్యమునకు దూరమైరి. శ్రీ రంగ మందిరంలోని బంగారు గిన్నె దేవదేవి యింట్లో కనబడుటచే చోళ దేశపురాజు దేవదేవిని, ఆళ్వార్లను ఇరువురిని చెఱసాలలో బంధించినాడు. ఆళ్వార్లు తమజ్ఞాన హీనతకు పశ్చాత్తప్త హృదయులై రేయింబవళ్ళు శ్రీ మన్నారాయణ చరణారవిందములను ధ్యానించుచుండిరి. శ్రీ రంగనాథుడు నిచులాపురాధీశునికి స్వప్నమున సాక్షాత్కరించి "రాజా! అతనికి

జ్ఞానోదయమగుటకై నేనే ఆ బంగారు పాత్రను దేవదేవికి చేర్చినాను. నిర్దోషికావున అతనిని విడిచి పెట్టు" మని ఆదేశించెను. రాజు వారిద్దరిని చెఱసాల నుండి రప్పించి సమ్మానించెను.

వీరికి తండ్రి పెట్టిన పేరు. 'విప్రనారాయణులు'. విషయాంతర ప్రవణులైనందున, ప్రాయశ్చిత్తముగా భాగవతదాస్యము చేసి, వారిశ్రీపాద తీర్థమును స్వీకరించి పరిశుద్ధులైన కారణముగా వీరికి, తొండరడిప్పొడి' అని ద్రావిడ నామమేర్పడెను. ఈ నామమే సంస్కృతమున 'భక్తాంఘ్రిరేణువు' అని వ్యవహృత మాయెను.

"క్లేశో ఽధికరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్।

అవ్యక్తాహిగతిర్దుః ఖం దేహవద్భిరవాప్యతే॥" (భ.గీ12-5)

సమస్త చేతన వస్తువులకు నియంతయై లోపల ఉండి సత్తాధారకమై యుండు అవ్యక్తము, అక్షరము, అమూర్తము అనబడు అంతర్యామి స్వరూపమును ఉపాసించుట మహాయోగులకు కూడా చాల కష్టసాధ్యము.

"మయ్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే।

శ్రద్ధయా పరయోపేతాస్తే యే యుక్త తమామతాః॥ (భ.గీ. 12-2)

అను భగవన్మతానుసారముగా అచ్చటచ్చట స్వయం వ్యక్తమైయున్న దివ్యమంగళ విగ్రహ విశిష్ట మగు అర్చా రూపమును అజ్ఞులు, విజ్ఞులు కూడ ధ్యానించి, పూజించుట సర్వశ్రేష్ఠము. కావున, పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తి సంవత్స మృద్ధులగు తొందరడిప్పొడియాళ్వార్లు శ్రీరంగానాథుని సాక్షాత్తుగా పరవాసుదేవునిగ భావించినారు. పెరిమాళ్ళకు అవిచ్ఛిన్న కైంకర్యమును చేయుచు "తిరుప్పళ్ళి యెళుచ్చి" (సుప్రభాతమును) ఆశువుగా అనుసంధానంచేసి లోకమునకు మహోపకారకులైన వారు శ్రీ తొందరడిప్పొడి యాళ్వార్లు.

శ్రీభూ నీళా సమేత శ్రీరంగనాథ పరబ్రహ్మణేనమః
ఆళ్వార్, ఎంబెరుమానార్, జీయర్ తిరువడిగళే శరణమ్.

# తిరుప్పళ్ళి యెళుచ్చి

**తమేవమత్వాపరవాసుదేవం**
**రంగేశయం రాజవ దర్హణీయమ్।**
**ప్రాబోధకీం యో ఽకృత సూక్తి మాలాం**
**భక్తాంఘ్రిరేణుం భగవంతమీడే॥**

**అర్థం**:-యః=ఏ మహానుభావుడు; రాజవత్=సార్వభౌముని వలె; అర్హణీయం=పూజనీయుడై; రంగేశయం=శ్రీరంగమందు శేషశాయియై యున్న; తం, ఏవ=ఆ శ్రీరంగనాథునినే; పరవాసుదేవం =పరమపదమునందు నిత్యవానము చేయు శ్రీమన్నారాయణునిగా; మత్వా=భావించి; ప్రాబోధకీం='మేలుకొలుపు' అను; సూక్తి మాలాం=ప్రబంధమాలికను; అకృత=రచించెనో; తం=అట్టి; భగవంతం =మహిమగల; భక్త+అంఘ్రి, రేణుం= 'భక్తుల పాద ధూళికణము' - అను అర్థము గల నామధేయమున్న, 'తొండరడిప్పొడి' యాళ్వార్లను;ఈడే=స్తుతించుచున్నాను.

**తా॥** శ్రీ తిరుమాలై యాండాన్లు సాయించిన తనియ ఇది :
సార్వభౌముని వలె సకల లోకములచే సర్వకాలము సంపూజితుడగుచు శ్రీరంగ విమాన మందు శేషతల్పమున నిఖిల రక్షణ యోగనిద్రా ముద్రాభిరాముడై పవ్వళించియున్న శ్రీరంగనాథస్వామినే సాక్షాత్ పరవాసు దేవునిగా అధ్యవసాయముచేసి, తిరుప్పళ్ళి యెళుచ్చి' అను

దివ్యప్రబంధమును జగద్ధితార్థమై అనుగ్రహించిన, శ్రీభక్తాంఘ్రిరేణువనుదాస్య నామము వహించిన మహానుభావునికి త్రికరణ శుద్ధిగా స్తుతిపూర్వక ప్రణతులర్పించుచున్నాను.

**మండంగుడి యెన్బర్, మామఱైయోర్, మన్నియశీర్**
**తొండరడిప్పొడి తొన్నగరమ్,-వండు**
**తిణర్త వయల్ తెన్నరంగత్తమ్మానై పళ్ళి**
**యుణర్తుంబిరా నుదిత్తవూర్॥**

**అర్థం:**- వండు, తిణర్త, వయల్=తుమ్మెదల, మ్రోతగల, పొలములచే; తెన్, అరంగత్తు, అమ్మానై=అందమైన, శ్రీరంగమునకు, నిర్వాహకుడైన స్వామిని; పళ్ళి=పడకనుండి; ఉణర్తుం=మేల్కొలిపి; పిరాన్=పరమ ఉపకారియైన; తొండర్+అడి, పొడి= భక్తాంఘ్రిరేణు, వనుదివ్యసూరి; ఉదిత్త=ఉద్భవించిన; ఊర్=ఊరు; మన్నియ=మాన్యమైన; శీర్=కీర్తిగల; తొల్+నగరం=ప్రాచీన నగరమైన; మండంగుడి ='మండంగుడి- అని; మా, మఱైఓర్=గొప్ప వేదవేత్తలు; ఎన్బర్=వచింతురు.

**తా॥** శ్రీ తిరువరంగప్పెరు మాళఱైయర్ సాయించిన తనియ ఇది :

భ్రమరముల ఝుంకారనాదము తో కూడిన వరిపొలములచే ఆవరింపబడిన శ్రీ రంగ దివ్యక్షేత్రమునకు నిర్వాహకుడైన శ్రీరంగనాథస్వామికి - పెరియ పెరుమాళ్ళకు 'మేల్కొలుపులు' పాడి, లోకోపకారమొనర్చిన 'తొందరడిప్పొడి' యాళ్వార్లు అవతరించిన దివ్యదేశము, శాశ్వతకీర్తిప్రతిష్ఠలతో కూడిన ప్రాచీన నగరమైన 'మండంగుడి' - అని పరమశ్రోత్రియు లందఱును ప్రస్తుతింతురు.

'తొండరడిప్పొడి' యాళ్వార్ తిరువడిగళే శరణమ్:-

1. కదిరవన్ కుణదిశై, చ్చిగరంవందణైందాన్,
కనైయిరు ళగన్ఱ దు, కాలైయంపొళుదాయ్।
మదువిరిందొళుగిన, మామలరెల్లామ్,
వానవరరశర్‌గళ్, వందువందీండి।
ఎదిర్‌దిశైనిఱైందన, రివరొడుంపుగుంద,
విరుంగళిఱ్ఱీట్టముం, పిడియొడు మురశుమ్।
అదిర్తలిల్ అలైకడల్, పోన్ఱుళదు ఎంగుమ్,
అరంగత్తమ్మా! పళ్ళి యెళుందరుళాయే॥

**అర్థం:-** కదిరవన్=భానుడు; కుణదిశై=తూర్పుదిక్కున; శిగరం=శిఖరమునకు; వందు=వచ్చి; అణైందాన్=చేరియున్నాడు. కనై=ఘనమైన (దట్టమైన) ఇరుళ్=చీకటి; అగన్ఱదు=విడిపోయినది. అమ్=అందమైన; కాలై,పొళుదు, ఆయ్=ప్రభాత, సమయము, అయ్యె; మా=మంచి; మలర్=పువ్వులు; ఎల్లాం=అన్నియు, విరిందు=వికసించి, మదు=మకరందము; ఒళుగిన=స్రవించుచున్నది. వానవర్=దేవతలు; అరశర్‌గళ్=రాజులును; వందు=వచ్చి,వందు=వచ్చి; ఈండి=గుమిగూడి; ఎదిర్‌దిశై=ఎదుటిప్రక్కన; నిఱైందనర్=నిలిచియున్నారు. ఇవర్‌ఒడుం=వీరితోబాటు; పుగుంద=వచ్చిచేరిన; పిడియొడు= ఆడయేనుగుల తో బాటు; ఇరుం, కళిర్త్, ఈట్టముం = గొప్పమగయేనుగుల గుంపులును; మురశుం=మురజ, మొదలైన వాద్యములును; అలైకడల్‌పోన్ఱు=ఆలలుగల సముద్రము వలె; అదిర్‌తలిల్=శబ్దముజేయుచు; ఎంగుం=అంతట; ఉళదు=వ్యాపించి యున్నవి. అరంగత్తు అమ్మా=శ్రీరంగనాథా! పళ్ళి, ఎళుందు=సెజ్జ నుండి లేచి; అరుళాయే=అనుగ్రహింపుమా।

**తా॥** అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! దాసుల విన్నపము నాలింపుము. కర్మసాక్షి యైన సూర్యుడు తన స్వరూపమునకు అనురూపమైన కైంకర్యము జేయుటకై ప్రాఙ్నగశిఖరమునకు వచ్చియున్నాడు. గాఢాంధకారము తొలిగిపోయినది. తిరువారాధనమునకు తగిన ప్రభాతసమయ మాసన్నమైనది. పూజార్హములగు వికసిత పుష్పముల నుండి మకరందము స్రవించు చున్నది. దేవలోకము నుండి దేవతలు, ఈ మధ్యమలోకమునుండి భూపతులును అహమహమికతో వచ్చి సంఘీభూతులై, ఉభయ విభూతి నాయకుడవైన నీ సన్నిధికెదురుగా నీ కృపాకటాక్ష వీక్షణ పాత్రులగుటకై బారులు తీర్చినిలిచియున్నారు. వీరితోబాటు వీరివాహనములైన గొప్పగొప్ప, అడ-మగ యేనుగుల గుంపులుకూడ వచ్చి, భూనభోంతరాళములు పిక్కటిల్లునట్లు శబ్దించుచున్నవి. మఱియొక వైపు వీణా మృదంగ, పటహ, కాహళ, భేరీ, మురజాది మంగళవాద్యములు ప్రయోగింపబడగా, ఉల్లోల కల్లోల మాలావ్యాకులమైన మహాసముద్ర ఘోషమువలె, మహాధ్వని దశదిశల వ్యాపించియున్నది. కాబట్టి, ఓ శ్రీరంగధామా! నీవు అహీన పర్యంకము నుండి మేల్కొని దాసుల అంతస్తిమిరము పటా పంచలగునటుల కటాక్షించి, నీ కిష్టమైన కైంకర్యములందు దాసులను నియమించి అనుగ్రహింపుము.

2. **కొళుంగొడి ముల్లైయిన్, కొళుమలరణవి,**
**కూర్ందదు కుణదిశై, మారుదమిదువో।**
**ఎళుందన మలరణై, ప్పళ్ళికొండన్నమ్,**
**ఈన్పని ననైంద, తమిరుంశిఱ గుదఱ।**
**విళుంగియ ముదలైయిన్, పిలంబురై పేళ్ వాయ్,**
**వెళ్ళెయిఱుఱ వదన్, విడత్తినుక్క నుంగి**

**అళుంగియ వానైయిన్, అరుంతుయర్ కెడుత్త,**

**అరంగత్తమ్మా! పళ్ళి యెళుందరుళాయే॥**

**అర్థం:-** కుణదిశై=తూర్పుదెస నుండి; మారుదం=మందమారుతము; ఇదువో=ఇదిగో; కొళుం,కొడి=దట్టముగా నెదిగిన, తీగెలుగల, ముల్లైయిన్=మొల్లల యొక్క; కొళుమలర్=మనోజ్ఞమైన పువ్వులతో; అణవి=మిళితమయి, కూరందదు=పరిమళించుచు వ్యాపించియున్నది. మలర్=పువ్వులను అణై=చేరి; పళ్ళికొండు=పడుకొనిన; అన్నమ్=హంస మిధునములు; ఈన్=కురియుచున్న; పని=మంచుచేత; ననైంద=తడిసిన; తం=తమ; ఇరుం=చక్కని; శిఱకు=ఱెక్కలను; ఉదఱి=విదళించుకొని; ఎళుందన= లేచి బయల్దేరినవి. విళుంగియ=మ్రింగుటకు తెరవబడిన; ముదలైయిన్=మొసలియొక్క; పిలంబురై=బిలసదృశమైన, పేళ్వాయ్ = పెద్దనోటిలోని; వెళ్ళియి ఱుఱ=తెల్లని కోఱలు తగులగా; అదన్=వాటియొక్క; విడత్తినుక్కు=తీవ్ర విషమునకు; అనుంగి=భయపడి; అళుంగియ = మొఱపెట్టిన; ఆనైయిన్=గజము యొక్క; అరుం=గొప్ప; తుయర్ = దుఃఖమును; కెడుత్త=పోగొట్టిన; అరంగత్తమ్మా శ్రీరంగనాథా! పళ్ళి, ఎళుందు, అరుళాయ్, ఏ=పడక నుండి లేచి అనుగ్రహింపుమా॥

**తా॥** తూర్పుదిక్కు నుండి తెల్లతెల్లవారగా చల్లని పిల్ల తెమ్మెరలు తలిరుల జొంపారులలో తలలెత్తుకొని విరిసిన మల్లె, మొల్ల పువ్వుల పరిమళమును పులుముకొని, 'మీరింకనునిద్రించు చున్నారా? మేల్కొనుడు? అని తట్టిలేపుచున్నవో అనునటుల మెల్లమెల్లగా వీచుచున్నవి. తామరపూల సెజ్జలో రాత్రి నిద్రించిన అంచల జంటలు మేల్కొని, మంచుచే తడిసిన తమ రెక్కలను చక్కగా రెపరెప లాడించి బయలుదేరినవి. పర్వత గుహను పోలిన నక్రవదన కుహరమందలి క్రకచకరాళదంష్ట్రలు శరీరమునకు తగిలి బాధింపగా భయపడి,

"లావొక్కింతయు లేదు,- ప్రాణముల్ ఠావుల్ దప్పెను- రావే యీశ్వర। కావవే వరద।" అని గజ గజ వణకుచు మొరపెట్టుకున్న గజేంద్రుని కుయ్యాలించి, జారిపోవుచున్న స్రగ్వస్త్ర భూషణాదుల నెఱుగక పరుగెత్తి కొనివచ్చి సంరక్షించిన, దీనావనబద్ధ దీక్షా! నీవే ఇట్లు నిద్రించిన యెట్లు? స్వామీ! సంసార నక్రగ్రస్తులమై వగంబొగలు చున్నదాసుల రక్షింపమేల్కొనుము

**3. శుడరొళి పరందన, శూళ్దిశైయెల్లామ్,**
**తున్నియతారకై, మిన్నొళి శురుంగి।**
**పడరొళి పశుత్తినన్, పనిమదియివనో**
**పాయిరుళగన్టదు, పైంపొళిల్కముగిన్।**
**మడలిడైక్కీఱి, వణ్ పాళైగళ్ నాఱ,**
**వైకఱై కూర్ందదు మారుద మిదువో।**
**అడలొళితిగళ్తరు, తిగిరి యంతడక్కై**
**అరంగత్తమ్మా! పళ్ళి యెళుందరుళాయే॥**

**అర్థం:-** శూళ్=చుట్టు, దిశై,ఎల్లాం=దిక్కులయందంతట, శుడర్, ఒళి=చండకిరణుని కాంతి (ఎండ), వరందన=వ్యాపించినది. తున్నియ=దట్టముగ ఉన్న; తారకై=నక్షత్రముల యొక్క, మిన్, ఒళి=దివ్యకాంతి; శురుంగి=క్రుంక్కి; (ఇక) పడర్, ఒళి=వ్యాపించిన కాంతిగల; పనిమది=శీతకిరణుడైన; ఇవన్; ఓ=ఇతడో (చంద్రుడు). పశుత్తినన్=పాలిపోయినాడు. పా. ఇరుళ్=క్రమ్మిన, చీకటి; అకన్టదు=తొలగినది. పైం=రమ్యమైన; పొళిల్=తోటలయందలి; కముగిన్ = పోకచెట్లయొక్క; మడల్=లేతమట్టలయొక్క; ఇడై=మధ్య భాగమును; కీఱి=చీల్చుకొని; వణ్,

పాళైగళ్=వెల్వడిన, పూవుపాళలు, (పూగుత్తులు) నాఱు=పరిమళింపగా; వైకత్తై, మారుతం=ప్రత్యూష, పవనములు, (తెల్లవారగా, వీచే పిల్లగాలలు) ఇదువో=ఇదిగో! కూర్ందదు=వ్యాపించియున్నవి. అడల్= భయముగొల్పునట్టి; తిగళ్=తీక్షణమైన; ఒళి=తేజస్సును; తరు=ఇచ్చునట్టి; తిగిరి=చక్రము; అం=అందమైన; తడ=విశాలమైన; కై=హస్తమందుగల; అరంగత్తమ్మా = శ్రీరంగనాథా! పళ్ళి, ఎళుందు, అరుళాయే॥

**తా॥** ఓ దీనబంధో। దయాసింధో! అహస్కరుని తీక్షణకిరణములు చుట్టు నల్గడల ప్రభుత్వ సూచకములుగ వ్యాపించినవి. దేదీప్యమానమైన చుక్కల కాంతి తగ్గిపోయినది. ఇక శీతకిరణుడా! కళావిహీనుడైనాడు. రాత్రిక్రమ్మిన కటిక చీకటి చీలిపోయినది, రమ్యోద్యానవనము లందలి పోకమ్రాకుల లేతమట్టల మధ్యభాగమును చీల్చుకొని బయల్వెడలిన పూరెమ్మల కమ్మనివాసనను నెమ్మదిగా మోసికొని వచ్చిన పిల్లగాలలు ఉషస్సుషమతో జగత్ప్రాణమై ప్రసరించుచున్నవి. ప్రత్యర్ధులకు తీక్ష్ణాయుధముగను, సమాశ్రితులకు దివ్యాభరణముగను కనబడు శ్రీసుదర్శన చక్రమును రమ్యమై, విశాలమైన కేల్దామరయందు ధరించుట చేతా అర్చితుడవగుటకు అనువుగా మేల్కొని, కృపతో మమ్మేలు కొనుమయ్యా!!

4. **మేట్టిళ మేదిగళ్, తళైవిడు మాయర్గళ్,**
**వేయంకుళలోశైయుం, విడైమణిక్కురలుమ్।**
**ఈట్టియ విశైదిశై, పరందనవయలుళ్।**
**ఇరిందిన శురుంబిన; మిలంగైయర్కులత్తై**
**వాట్టియ వరిశిలై, వానవరేతే,**
**మాముని వేల్వియైక్కాత్తు, అవపిరదమ్।**

**అట్టియ వడుతిఱ లయోత్తి యెమ్మరశే,**
**అరంగత్తమ్మా! పళ్ళియెళుందరుళాయే॥**

**అర్థం:-** మేడు=బలిసిన, ఇళం=లేత, మేదిగల్=గేదెల గుంపులను; తళై=పచ్చిక బయళ్ళకై; విడుం=(పలుపులు) విడిచిన; ఆయర్‌గళ్=గోపాలురు; వేయం, కుళల్=వెదురు పిల్లనగ్రోవుల యొక్క, ఓశైయుం=ధ్వనియు; విడైమణిక్కురలుమ్ = ఎద్దుల గంటల ధ్వనియు; ఈట్టియ = ఈ (రెండింటి) సామూహికమైన; ఇశై=రమ్యధ్వని; దిశై=దిక్కులయందు; పరందన=వ్యాపించెను. వయలుళ్=పొలములలోని; శురుంబినం= పూలరసముత్రాగిన, తుమ్మెదలు; ఇరిందన=చెదరిపోయినవి. ఇలంగైయర్=లంకలోనున్నవారి (రాక్షసుల) కులత్తై=వంశమును; ఆట్టియ=నిర్మూలించిన; అరిశిలై=శార్‌ఙ్గమను ధనుస్సుగలిగి, వానవరేఱే=దేవతలకధిపతివై; మా, ముని=మహాముని (విశ్వామిత్రుని) యొక్క; వేళ్వియై=యజ్ఞమును; కాత్తు = కాపాడి; అవపిరదం = అవభృధస్నామును; ఆట్టియ=చేయించిన దిట్టవై; అడుతిఱల్=జయించు పరాక్రమముగల; అయోత్తి=అయోధ్యయందలి; ఎం, అరశే=మా, రాజా! అరంగత్తమ్మా=శ్రీరంగనాథా! పళ్ళి, ఎళుందరుళాయే!!

**తా॥** ఓ జగద్రక్షకా! బలిసియున్నచిన్న గేదెల మందను తలుగులు విడిచి, వాటి వెంటబోయిన గొల్లవాండ్రు ఊదిన వేణునాదము, వృషభముల మెడలలోని మువ్వల ధ్వని, ఈ రెండు కలిసిన మహానినాదము ఊరిలోను, పచ్చిక బయళ్ళలోను,-అన్నిదిక్కుల- పిక్కటిల్లినది. పొలములలోని పూదేనెను కడుపార త్రాగిన తుమ్మెదలు ఝుంకారముచేయుచు ఎల్లెడల ఎగిరిపోయినవి. తిరువారాధన సమర్పించు కాలము సంప్రాప్తమైనది. ప్రాబోధకీ సేవచేయుటకై దాసులను, కాలము మీర కుండవినియోగించుకొని, కటాక్షింపుము. పూర్వములంకానగరమున రాక్షసుల వంశమును నిర్మూలించిన శార్‌ఙ్గ

మనుచాపమును ధరించి, బ్రహ్మాది దేవతలకు అధిపతివైన సర్వేశ్వరా! విశ్వామిత్రమహాముని జన్నమును మన్ననతో కాపాడి, వారికి అవభృథ (క్రతుదీక్షాంత) స్నానమును చేయించి, పగతురను జయించిన పరాక్రమశాలివై, అయోధ్యానగర పరిపాలకుడవుగా అవతరించిన శ్రీరామచంద్ర ప్రభూ! ఫణిపతి తల్పమున నిద్రించుటమాని, ప్రబుద్ధుడవై ప్రపన్నులను పాలింప కృపజేయుము ఓ శ్రీరంగవిభూ॥

5. **పులంబిన పుట్కళుం, పూంపొళిల్‌కళిన్వాయ్,**
**పోయిత్తుక్కంగుల్, పుగుందదు పులరి।**
**కలందదు కుణదిశై, కన్నైకడలరవమ్,**
**కళివండు మిళత్తియ, కలంబగంపునైంద।**
**అలంగ లంతొడయల్‌కొండు, అడియిణైపణివాన్,**
**అమరర్‌గళ్ పుగుందన రాదలి లమ్మా!**
**ఇలంగైయర్ కోన్, వళిపాడుశెయ్ కోయిల్,**
**అరంగత్తమ్మా! పళ్ళి యెళుందరుళాయే॥**

**అర్థం:-** పూంపొళిల్ కళిన్‌వాయ్=పూలతోటలయందుండు; పుల్‌గళుం = పక్షులు; పులంబిన=కూయుచున్నవి. కంగుల్=చీకటిరాత్రి; పోయిత్తు = గడచినది, పులరి=ఉషఃకాలము; కుణదిశై=తూర్పుదెస; పుగుందదు = ప్రవేశించినది. కన్నై,కడల్, అరవం=మహా, సముద్ర, ఘోషము; కలందదు = వ్యాపించినది. కళి, వండు=మదించిన, తుమ్మెదలు; మిళత్తియ='జు'మ్మనుచున్నవి. కలంబగన్=వివిధ పుష్పములతో; పునైంద=కట్టబడిన; అం = సుందరముగ; అలంగల్= అల్లాడుచున్న; (కదలుచున్న) తొడయల్ = మాలికలను; కొండు=పట్టుకొని; అమరర్‌గళ్=దేవతలు; అడి, ఇణై=పాదయుగళమందు;

పణివాన్=సమర్పించుటకై; పుగుందనర్= ప్రవేశించినారు. అదలిల్=అందువలన; అమ్మా=ఓస్వామీ! ఇలంగైయర్ కోన్=లంకాధిపతి.(విభీషణుడు) వళిపాడుశెయ్= దారిని పాడుచేసి, (నిత్యకైంకర్యము చేయునట్టి); కోయిల్=శ్రీరంగమందిరమందున్న; ఎం, పెరుమాన్=మా, దైవమా! పళ్ళి, ఎళుందు, అరుళ్, ఆయే!!

తా॥ పూదోటల యందలి పక్షులు మేల్కొని నల్గడలకూయుచున్నవి. గాఢాంధకార బంధురమైన రాత్రి గడచిపోయినది. తూర్పున తెలతెల్లవారినది. పారావారమహాధ్వని రోదసిలో వ్యాపించినది. పూదేనెను మెండుగా త్రాగిన గండు తుమ్మెదలు దండిగా మ్రోయుచున్నవి. బ్రహ్మాదిదేవతలు రంగురంగుల పూలచే కూర్చబడిన సుగంధభరిత మాలికలను చేత బట్టుకొని మీ పాదారవింద యుగళమున నమర్పించుటకై తమసన్నిధిలో వేచియున్నారు. లంకానగరాధీశుడైన విభీషణుని మార్గమును-ఉద్దేశ్యమును-సాగనీయక, అతనిచేత నిత్యము కైంకర్యములను పొందుచు శ్రీరంగమందు వెలసి యున్న మా కులదైవమా! ఆ శ్రితపారిజాతమా! దాసులకైంకర్యమంగీకరింప మేల్కొనుమా!

6. ఇరవియర్ మణినెడుం, తేరొడు మివరో,
ఇఱైయవర్ పదినొరు, విడైయరుమివరో।
మరువియ మయిలిన, నఱుముగ నివనో,
మరుదరుం వశుక్కళుం, వందువందీండి।
పురవియోడాడలుం, పాడలుంతేరుమ్,
కుమరతండం పుగుందీండియ వెళ్ళమ్।
అరువరై యనైయ, నిన్ కోయిల్ మున్నివరో,
అరంగత్తమ్మా! పళ్ళియెళుందరుళాయే॥

**అర్థం:-** మణినెడుం=మణులచే పొసగబడిన; తేరొడు=రధముల తోడ; ఇరవియర్ = ద్వాదశాదిత్యులు; ఇత్తై యవర్=లోకనిర్వాహకులైన; పదినొరు = పదకొండుగురు; విడైయరుం=రుద్రులైన; ఇవరో=వీరును. మరువియ = వాహనమైన; మయిలినన్= మయూరముగల; అఱుముగన్=షణ్ముఖుడు-అను; ఇవనో = ఇతడును; మరుదరుం=మరుత్తులు-(అను-నలుబైతొమ్మిది వాయువులు)ను; వశుక్కళుం=ఎనమండ్రు వసువులును; వందు, వందు=వచ్చి, వచ్చి; ఈండి=గుంపుగ చేరినారు. పురవియోడు తేరుం=అశ్వములతో కూడిన రథములును; ఆడలుం=నర్తకులును; పాడలుం=గాయకులును; కుమర తండం=కుమారస్వామి యెక్క సైన్యము, ఈండియ, వెళ్ళం=వెల్లువ వంటి గుంపు; పుగుందు=చేరి; అరువరై=బంగరు కొండను; అనైయ=పోలియున్న; నిన్=నీయొక్క; కోయిల్= మందిరమునకు; మున్=ముందు, ఇవరో = నిలిచియున్నారు వీరు, అరంగత్తమ్మా= శ్రీరంగక్షేత్ర నిర్వాహకా! పళ్ళి, ఎళుందు, అరుళ్, ఆయే॥

**తా॥** ఓ జగన్నాధా! రత్నఖచిత సువర్ణస్యందనములందు అధివసించిన ద్వాదశాదిత్యులును, లోక నిర్వాహకులైన ఏకాదశ రుద్రులును, మయూర వాహనుడైన కుమారస్వామియు; మరుద్గణమును, అష్టవసువులను, వీరి గుఱ్ఱములతోకూడిన రథములును, నర్తకులు, గాయకులును, శిఖివాహనుని సేనావాహినియు,- వీరందఱు గుంపులుగాజేరి, మేరుపర్వతము భంగి మహోన్నతమై ప్రకాశించు మీ మందిరద్వారమునకు ముందుభాగమున నిలిచియున్నారు. శ్రీరంగనాధా! పాముపడక నుండి మేల్కొని, నిన్నుపూజింప వచ్చిన దాసులందరికి దయతో దర్శన మిమ్ము.

**7. అందరత్తమరర్గళ్, కూట్టంగ ళివైయో.**

**అరుంతవమునివరుం, మరుతరుమివరో,**

**ఇందిరనానైయుం, తానుంవందివనో,**

**ఎంబెరుమాన్, ఉన్ కోయిలిన్ వాశల్।**

**శుందరర్ నెరుక్క, విచ్చాదరర్ నూక్క,**

**ఇయక్కరుం, మయంగినర్, తిరువడిత్తొళువాన్।**

**అందరం పారిడ మిల్లై, మత్తిదువో,**

**అరంగత్తమ్మా! పళ్ళి యెళుందరుళాయే॥**

**అర్థం:-** అందరత్తు=అండాంతర్వర్తులైన; అమరర్గళ్=దేవతలు, కూట్టంగళ్=(వారి) వరివారవములు; ఇవైయెూ=ఇవియేకాక; అరుం, తవ, మునివరుమ్=అద్భుత, తపోనిష్ఠులైన (సనకసనందనాది) మునులును; మరుతరుం=మరుత్తులును; ఇవరో =వీరేకాక; ఇందిరన్, తానుమ్=ఇంద్రుడు, తానును; ఆనైయువ్=(ఐరావతము- అను) ఏనుగును; వందు, ఇవనో=వచ్చుటయే కాక; ఉన్=నీయొక్క; కోయిలిన్= సన్నిధి యొక్క; వాశల్=వాకిట; తిరు,అడి, తొళువాన్=శ్రీపాదములను సేవించుటకై; శుందరర్=సుందరులైన గంధర్వులు, నెరుక్క=క్రిక్కిరిసి యుండగా; విచ్చాదరర్= విద్యాధరులు; నూక్క=త్రోయుచుండగా; ఇయక్కరువ్=యక్షులును; మయంగినర్=స్తబ్ధులైనిల్చియున్నారు. మత్తు=మఱియు; ఇదువో=ఇదిగో; అందరం=ఆకాశమున; పార్=భూమియందును; ఇడం=చోటు; ఇల్లై=లేదు. అరంగత్తమ్మా! పళ్ళి, ఎళుందు; అరుళాయే!!

**తా॥** ఓ దేవదేవా! నిఖిలాండాంతర్గతులగు అమరులు, వారి పరివారములు మహా తపస్సంపన్నులైన సనకసనందనాది మునులును; మరుద్గణదేవతలతో పాటు, ఐరావతముతో కూడ దేవేంద్రుడు దేవరవారి శ్రీచరణ సేవకై వచ్చినాడు.

వీరు మాత్రమేకాక; గంధర్వులు, విద్యాధరులు, యక్షులును క్రిక్కిరిసి యుండి, ఒకరి నొకరు నెట్టుకొనుచు, మీ దివ్యపాద పద్మములను సేవింప నిరీక్షించుచున్నారు. ఖగోళమున, భూగోళముననను, ఏ కొంచెము ఎడము లేకుండ నిండుగా చేరి వేచియున్నారు. ఓ శ్రీరంగేశ! నాగపర్యంకము నుండి మేల్కాంచి, సందర్శనమొసగి సంరక్షింపుము.

**8. వంబవిళ్ వానవర్, వాయుఱై వళంగ,**
**మానిది కపిలై, యొణ్ కణ్ణాడిముదలా।**
**ఎంబెరుమాన్ పడిమైక్కలం కాండఱ్కు,**
**ఏఱ్ఱన వాయిన కొండు, నన్మునివర్।**
**తుంబురునారదర్, పుగుందన రివరో,**
**తోన్డిన నిరవియుం, తులంగొళి పరప్పి।**
**అంబరతలత్తి నిన్డగల్ గిన్డదిరుళ్ పోయ్,**
**అరంగత్తమ్మా! పళ్ళియెళుందరుళాయే॥**

**అర్థం:-** వళంగ=సమర్పించుటకై; వంబవిళ్=సువాసనగల; వాయుఱై=గఱిక మొక్కలను; మానిధి=మహానిధులను; కపిలై=కపిలధేనువులను; ఒణ్=ప్రకాశించు; కణ్ణాడి=అద్దములను; ముదల్, ఆయ్=మొదలైన, ఎంబెరుమాన్= మాస్వామి, (తాము) కాండర్కు=కాంచుటకు; ఏఱ్ఱన=తగిన; వాయిన=వైనములైన; పడిమైక్కలం= ఉపకరణ పదార్థములను; కొండు=తీసికొని; వానవర్=దేవతలు; నల్, మునివర్= అనన్యప్రయోజనులైన, మునివరులు; తుంబురు, నారదర్=తుంబురు, నారదులు, పుగుందనర్=ప్రవేశించియున్నారు. ఇవరో=వీరుకాక; ఇరవి=సూర్యుడు; తులంగు= అధికమైన; ఒళి=తేజస్సును; పరప్పి=పరచి, తోన్డినన్=

ఉదయించెను. ఇరుళ్=చీకటి; అంబర తలత్తి నిన్ఱు=గగన తలము నుండి; పోయ్,అగల్గిన్ఱదు= ఎడబాసిపోయినది. అరంగత్తమ్మా! పళ్ళి ఎళుందరుళాయే.

**తా॥** సర్వలోకశరణ్యా! దేవతలు దేవరవారికి సమర్పింప దగిన కమ్మని వాసనలనీను మరువము, దవనము, దూర్వాంకురములను, 'మహా పద్మము, పద్మము,శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, ఖర్వము' అను నవనిధులను, ప్రశస్తములైన కపిల వర్ణధేనువులను, నిర్మల మణి దర్పములను, ఒకటేమిటి? సుప్రభాత విశ్వరూప సందర్శనమునకు సముచితములైన సకల దివ్యమంగళ వస్తువులను తీసికొని వచ్చి నిలిచి యున్నారు. సంతత ధ్యానమగ్నులైన మహామునులును, మంగళగీతములను పాడునట్టి తుంబురుడు, నారదుడను దేవర్షులును ఈ సంఘమున చేరి వేచియున్నారు. దినమణి తనవేడికిరణములను నలుగడల నెగజిమ్ముచు నావిర్భవించెను, అంధకారము ఆకసము నుండి ఎప్పుడో ఎడబాసిపోయినది. శ్రీరంగనాయకా! దివ్య,మంగళకరో పకరణములనెల్ల కటాక్షింప మేల్కొని, శేషభూతులనేల్కొన సంకల్పించిననే కాని అస్మదాదుల అజ్ఞానతిమిరము సమసిపోదు. సకలలోక నిర్వాహకా! నిద్రవీడిలెమ్ము.

9. **ఏదమిల్ తణ్ణుమై, యెక్కం మత్తళి**
**యాళ్ కుళల్, ముళువమోడిశైదిశైకెళుమి।**
**కీదంగళ్ పాడినర్, కిన్నరర్ గరుడర్గళ్,**
**కందరువరు మివర్, కంగులుమెల్లామ్ ।**
**మా దవర్ వానవర్, శారణరియక్కర్,**
**శిత్తరుంమయంగినర్, తిరువడిత్తొళువాన్।**
**ఆదలిల వర్కు, నాళోలక్కమరుళ**
**అరంగత్తమ్మా! పళ్ళి యెళుందరుళాయే॥**

**అర్థం:-** ఏదం=దోషము; ఇల్=లేనట్టి, తణ్ణుమై=తమ్మెళి; ఎక్కం=ఏకతంత్రీ వాద్యము; మత్తళి=మద్దెల; యాల్=వీణావిశేషము; కుళల్=పిల్లనగ్రోవి (మురళి); ముళువవెూడు=మొదలగువాటి; ఇశై=గానము; దిశై=దిక్కులందు; కెళుమి=వ్యాపించునట్లు; కీదంగళ్=గీతములు; పాడినర్=పాడుచున్న; కిన్నరర్=కిన్నరులు; గరుడర్గళ్=గరుడులు, కందరువరుం; ఇవర్=గంధర్వులు (అను) వీరును; కంగులుం= రాత్రి; ఎల్లాం=అంతయు; మా=గొప్ప; తవర్=తపస్సుచేయు ఋషులు; వానవర్=దేవతలును; శారణర్=చారణులు, ఇయక్కర్=యక్షులు; శిత్తరుమ్=సిద్ధులును; తిరు, అడి, తొళువాన్ = శ్రీపాదములను సేవించుటకై; మయంగినర్=మైమరచి నిలిచియున్నారు. ఆదలిల్=అందువలన, అవర్కు=వారలకు; నాళ్=ఈనాడు, ఓలక్కం=ఓలగమునకు; (దర్బారుకు) అరుళ=కపజేసి; (దర్శనమిచ్చుటకై) ఆరంగత్తమ్మా! శ్రీ రంగనాథా! పళ్ళి=పడకనుండి; ఎళుందు=లేచి; అరుళాయే=దయజేయుమా!

**తా॥** ఓ పరమపురుషా! మీరు మేల్కొను వేళ మంగళవాద్యములు మీకు శ్రవణానందకరములు. నిర్దుష్ట నృత్తగీతవాద్యప్రవీణులు మీ సన్నిధిలో నిలిచి వేచియున్నారు.తమ్మెట, ఏకతంత్రి, (తంబూరా), వీణా వేణుమృదంగ కాహళఘటాది మంగళ వాద్యనాద యుక్తముగా సుప్రభాత గీతాలాపనము చేయుచున్న కిన్నర. కింపురుష, గంధర్వులును; రేయెల్ల తపస్సునాచరించు మహర్షులును, చారణులు, యక్షులు, సిద్ధులును- వీరందఱు మీ పాదారవింద సేవకొరకు పరవశులైనిలిచి యున్నారు.

ఈ శుభదినమున, ఓ శ్రీరంగరాజా! పేరోలగమునకు వేంచేసి, దాసవర్గమునకు సందర్శన భాగ్యము కలిగించుటకై మృదుతల ఫణిరాడ్భోగ పర్యంకము నుండి మేల్కొనుము.

10. **కడిమలర్ కమలంగళ్, మలర్ందన వివయో.**
**కదిరవన్ కనైకడల్, ముళైత్తననివనో।**
**తుడియిడైయార్, శురికుళల్ పిళిందుదళి,**
**తుగిలుడుత్తేఱినర్, శూళ్పునలరంగా।**
**తొడైయొత్త తుళవముం, కూడైయుం పొలిందు,**
**తోన్డియ తోళ్, తొండరడిప్పొడి యెన్నుమ్।**
**అడియనై యళియ, నెన్దరుళి యున్నడి యార్క్కు,**
**ఆళ్ పడుత్తాయ్, పళ్ళియెళుందరుళాయే॥**

**అర్థం:-** కడిమలర్, కమలంగళ్=పరిమళము గల కమలములు; ఇవయో = ఇవిగో; మలర్ందన= వికసించినవి, కదిరవన్=అంశుమాలియైన సూర్యుడు; కనైకడల్= మహాసముద్రము నుండి; ఇవనో=ఇదిగో! ముళైత్తనన్=(మొలిచెను.) ఆవిర్భవించెను, తుడి, ఇడైయార్=తను మధ్యలు. (సన్నని, నడుముగల స్త్రీలు). శురి, కుళల్= కుటిలకుంతలముళ్లను; పిళిందు=పిండి; ఉదఱి=విదళించి; తుకిల్=వలువలను, ఉడుత్తు=ధరించి; ఏఱినర్=గట్టెక్కిరి. శూళ్=చుట్టుఉన్న; పునల్=పుణ్య (కావేరీ) నది గల; అరంగా=శ్రీరంగభూపతీ! తొడై, ఒత్త=కట్టబడిన; తుళవముం=తులసీ మాలికలు కలిగిన; కూడైయుం=గూడ (బుట్ట)ను; తోళ్=భుజముల యందు; పొలిందు=ధరించి; తోన్డియ= ప్రకాశించు; తొండరడిప్పొడి='భక్తాంఘ్రిరేణువు'-ఎన్నుం=అనబడు; అడియనై=దాసుని; అళియన్=అనాధుడు; ఎన్ను=అని; అరుళి=కృపజేసి; ఉన్, అడియార్క్కు= నీ, దాసులకు; ఆళ్, పడుత్తాయ్=దాసునిగా, జేయుము.(కాబట్టి)పళ్ళి=పాన్పునుండి; ఎళుందు=లేచి; అరుళాయే=కటాక్షింపుము.

**తా॥** ఉభయ విభూతినాయకా! దివ్యపరిమళముగల కమలములు ప్రపుల్లములై ప్రకృతి రంజకముగా నున్నవి. సూర్యుడు అనంతములైన రంగురంగుల

కిరణాలను, కొట్టు మిట్టాడుచు ఘోషించుచున్న కడలికెరటాలపై ప్రసరింపజేయుచు పైకి లేచెను. కృశోదరులు కావేటిలో స్నానము జేసి తమ, వంకలు వంకలుగానున్న కురులను బట్టతో చుట్టి, నీరుజారపిండికొని, విదలించి, వలువలు కట్టుకొని గట్టునకెక్కిరి. ప్రభాతసూచకములైన కృత్యములన్ని చకచక సాగిపోవుచున్నవి. ఓశూళ్ పునలరంగా। (పవిత్ర నదీమతల్లికయైన కావేటిచే పరివృతమైన శ్రీరంగ క్షేత్రమును రంగస్థలముగా చేసికొనిన జగన్నాటక సూత్రధారీ!) నీకు పరమభోగ్యముగా కూర్చబడిన శ్రీతులసీ దామములతో నిండిన గూడ (ల)ను భుజములకు. తగిలించుకొనిన స్వరూపము గలిగిన 'భక్తాంఘ్రిరేణువు' అను దాసుని-అనాధుడు, అగతికుడని అభిమానించి, సార్ధక నామధేయునిగాజేయ ప్రార్థించుచున్న దాసుని కటాక్షింప మేల్కాంచుము.

తొండరడిప్పొడి యాళ్వార్ తిరువడిగళేశరణమ్

## మధురకవి యాళ్వార్ల వైభవము (కణ్ణినుణ్‌శిరుత్తామ్బు)

గణేశః కుముదో నామ్నా కవిర్మధురసంజ్ఞికః।
చైత్రేమాసి శుభే చిత్రతారకాయా మజాయత॥

పాండ్యదేశమందు తిరుక్కోళూర్ అను (కురుకాపురికి దిగువ తామ్రపర్ణీ నదీ తీరమున గల) దివ్యక్షేత్రమున (సూర్యోదయమునకు అరుణోదయమువలె) నమ్మాళ్వార్లకంటే ముందే శ్రీ మధురకవి యాళ్వార్లు శ్రీ కుముద గణేశాంశమున చైత్రమాసము నందు చిత్తానక్షత్రమున ఉత్తమవైదిక కుటుంబములో అవతరించిరి.

వీరికి జననీజనకులు ప్రాప్తకాలమందు వైదిక సంస్కారములను జరిపించి సకల విద్యలను సదాచార్యుల వద్ద అధికరింపచేసిరి. సర్వశాస్త్రపారంగతులైన వీరు మోక్షప్రదములగు అయోధ్యాది దివ్యదేశములను సేవించుటకై ఉత్తర దేశమునకు వేంచేసిరి. దివ్యక్షేత్రములను సేవించుచు వచ్చుచున్న మధుర కవులు శ్రీ నమ్మాళ్వార్ల వైభవమును భాగవతబృందముచే అప్పుడప్పుడు వినుచు వచ్చుచుండిరి. ఒకనాటి రాత్రి దక్షిణ దిక్కున అప్రాకృత దివ్యతేజస్సు వీరికి కనిపించినది. రెండు మూడు దినములదే విధముగ కనబడుటచే ఆశ్యర్యపడి దాని మూలమును తెలసికొనుటకై దక్షిణ దిశకు పయనింప సాగిరి. అతిత్వరలో దారిలో ఉన్న దివ్యతీర్థక్షేత్రములను దర్శించుకొనుచు తిరునగరికి చేరిరి. ఆ రాత్రి ఆయూరికి దక్షిణమున ఆదివ్య తేజస్సు కనబడనందున అది ఈ దివ్యనగరి యందే ఉన్నదని నిశ్చయించి, ఆగ్రామస్థుల ద్వారా ఆశ్చర్యజనకమగు వృత్తాంతమును తెలిసికొనిరి.

"పొలిన్దు నిన్ద పిరాన్" అను పెరుమాళ్ళ సన్నిధిలో ఉన్న తింత్రిణీ వృక్షమువద్దకు మధురకవులు చేరుకొనిరి. అక్కడ ఆ చింత చెట్టు నీడలో కన్నులు మూసికొని షోదశకళా పూర్ణుడగు చంద్రునివలె, షోడశ వత్సరముల

వయస్సు కలిగిన వారై పద్మాసనోప విష్టులై, పరతత్త్వ బోధకమైన జ్ఞానముద్రతో శోభించు శ్రీ పరాంకుశులను సేవించిరి. మధురకవులు పెద్దధ్వనితో వారు కన్నులు తెరచునట్లు చేసి, కొన్ని ప్రశ్నలు వేసి, భావగర్భిత మగుసమాధానములను పొంది వీరు నమ్మాళ్వారులు (మనలను ఏలువారు) అని, వారి శ్రీపాదములకు సాష్టాంగప్రణామ మొనర్చిరి. ఆచార్య స్వరూపమునందు ఈశ్వరత్వము, ఆచార్యత్వము రెండును చేరియున్నందున ఆచార్యుడే సర్వోత్కృష్టుడు, ఆచార్యుని ఆశ్రయించి నప్పుడే సర్వేశ్వరుని ఆశ్రయించినట్లగునని భావించు మధురకవులు, మనోవాక్కాయములచే శ్రీ శఠకోపదివ్యసూరినే సదా అనుభవించుచు వారికి ప్రథమ శిష్యులైరి. నమ్మాళ్వార్లు భగవదనుభవ పరీవాహరూపముగా సాధించిన ద్రావిడ వేదమును, వాల్మీకి భగవానుడు శ్రీ మద్రామాయణమును కుశలవులకు వలె, శ్రీ మధురకవులకు ఉపదేశించి వారిని విశేషముగ కటాక్షించిరి. భాగవత నిష్ఠాపరుడగు శత్రుఘ్నుడు పారతంత్ర్యనిష్ఠా పరుడగు భరతుని సేవించిన విధముగా మధురకవులు తమకు దివ్యజ్ఞానము ననుగ్రహించి మహోపకారులగు శ్రీ నమ్మాళ్వార్ల శేషత్వమునే పరమోపాదేయముగా స్వీకరించిరి. చరమ పర్వనిష్ఠను అనగా ఆచార్యాభిమానమే ఉజ్జీవన సాధనము అని బోధించుచు భాగవతనిష్ఠను ప్రతిపాదించుచున్న "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" అను ప్రబంధమును రచించి, ప్రపన్న జనులకు మహోపకారకులై లోకమును తరింప జేసే భాగ్యమును కలిగించిన వారు శ్రీ మధురకవి యాళ్వార్లు.

ఆళ్వార్, ఎంబెరుమానార్, జీయర్ తిరువడి గళేశరణమ్.

# కణ్ణినుణ్ శిఱుత్తాంబు

## (టీకాతాత్పర్యసహితమ్)

**అవిదిత విషయాంతరః శఠారేః**

**ఉపనిషదాముపగాన మాత్రభోగః।**

**అపిచ గుణవశాత్తదేక శేషీ,**

**మధురకవిర్ హృదయే మమావిరస్తు॥**

**అర్థం**:- అవిదిత-తరః। అవిదిత=తెలియబడని; విషయ+అంతరః=ఇతర విషయములు గలవాడును; శఠారేః=నమ్మాళ్వార్ల యొక్క; ఉపనిషదాం=ద్రవిడో పనిషత్తుల యొక్క; ఉపగానమాత్ర భోగః=దేవగానమాలపించుటచే సుఖానుభవము గల వాడును; అపి,చ=మఱియు; గుణవశాత్=(ఆళ్వార్ల) గుణములకు వశుడగుట వలన; తత్+ఏక శేషీ=వారికి మాత్రమే శేషభూతుడగు; మధురకవిః =మధురకవియాళ్వార్లు; మమ=నాయొక్క; హృదయే=హృదయమందు; ఆవిః+అస్తు= ఆవిర్భవించి యుండుగాక.

**తా॥ శ్రీ నాథమునులు సాయించిన తనియ ఇది:-**

ఆచార్యుడే ఉపాయము, ఉపేయము-అను అధ్యవసాయముతో నుండి ఇతర విషయములనన్నిటిని నవాననముగ పరిత్యజించి, శ్రీనమ్మాళ్వార్ల అనుగ్రహించిన ఉపనిషత్సారములగు తిరువాయ్ మొళి, తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియ తిరువందాది, అను నాలుగు దివ్యప్రబంధములను సదాగానము చేయుటయే పరమభోగముగనెంచి వారి గుణగణమునందే ప్రవణులై, వారికే శేషభూతులైన శ్రీ మధురకవి యాళ్వార్లు, నా హృదయ

పీఠమును స్థిరనివాసముగ జేసికొని యుందురుగాత.

**వేఱొన్ఱుం నానఱియేన్, వేదంతమిళ్ శెయ్ద,**
**మాఱన్ శఠకోపన్, వణ్ కురుగూర్-ఏఱెంగళ్,**
**వాళ్ వా మెన్ఱేత్తుం మదురకవియార్, ఎమ్మై**
**ఆళ్వారవరే యరణ్॥**

**అర్థం**:-వణ్=ఉదారపురుషులుండు; కురుకు+ఊర్=కురుకా పురికి ఏలికయగు; శఠకోవన్=శఠవాయువును రానీయక కోపించినట్టి (శఠ=అజ్ఞానము/మోహమును; కోవన్=కన్నెఱ్ఱజేసి జయించినట్టి) వేదం=వేదమును, తమిళ్=ద్రవిడభాషయందు, శెయ్ద=చేసిన; ఏఱ్=అందమైన; మాఱన్='మాఱన్' అను పేరు గల ఆళ్వార్లను తప్ప; వేఱ్+ఒన్ఱువ్=వేరొకటియు; నాన్=నేను; అఱియేన్=ఎఱుగను. ఎంగళ్=మాకు; వాళ్వు=సుఖోజ్జీవనము; ఆమ్=అగుదురు. ఎన్ఱు=అని; ఏత్తుం=స్తుతించు, మదురకవియార్=శ్రీ మధురకవి యాళ్వార్లు; ఎమ్మై=మనలను; ఆళ్,వార్=పాలించువారు. అవరే=వారే; అరణ్=రక్షకము.

**తా॥** 'అర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు-అను ఉదారులైన సత్పురుషులు నివసించు కురుకా పురికి (తిరునగరికి) అధిపతి నమ్మాళ్వార్లు. వీరే సంస్కృతవేదమును ద్రావిడవేదముగా చేసినవారు. 'శఠకోపన్; మాఱన్, అనునామాంతరములు గల శ్రీనమ్మాళ్వార్లను తప్ప వేరెవరిని కూడ నేను గుర్తెఱుగను. మాకు సుఖజీవన కారకులు, సర్వవిధముల ఉత్తారకులు వారే; అని, ఆచార్యులను స్తుతించునట్టి శ్రీమధురకవి యాళ్వార్లు మమ్మేలు కొందురు. మధురకవి యాళ్వార్లకు నమ్మాళ్వార్లు ఎట్లో, అట్లే మాకు శ్రీమధురకవి యాళ్వార్లే సర్వరక్షకము.

మధురకవి యాళ్వార్ తిరువడిగళే శరణమ్:-

**1. కణ్ణినుణ్ శిఱుత్తాంబినాల్,**
**కట్టుణ్ణప్పణ్ణియ పెరుమాయ, నెన్నప్పనిల్;**
**నణ్ణిత్తెన్ కురుకూర్‌నంబి యెన్ణక్కాల్,**
**అణ్ణిక్కు మముతూఱుమెన్నావుక్కే॥**

**అర్థం:-** కణ్ణి=ముడులుగల, నుణ్=నున్నవి/నన్నని; శిఱు=చిన్న; తాంబినాల్=త్రాటిచే; కట్టుణ్ణ, పణ్ణియ=కట్టుబడునట్లు, చేసికొనిన; పెరు=గొప్ప; మాయన్=ఆశ్చర్యగుణచేష్టలుగల; ఎన్, అప్పనిల్=నాకు స్వామియైన సర్వేశ్వరుని కంటే; నణ్ణి=ప్రీతితో ఆశ్రయించి; తెన్=దక్షిణమున ఉన్న; కురుకూర్=తిరునగరికి; నంబి, ఎన్ణక్కాల్=ఏలికయైన, నమ్మాళ్వారుల తిరునామమును అనుసంధించినచో; ఎన్, నావుక్కే=నా, నాలుకకే; అణ్ణిక్కుమ్=(తియ్యగా) రుచించును. అముతు= అమృతము; ఊరుమ్=ఊరుచుండును.

**తా॥** పరమ యోగులకు కూడ పట్టుబడని శ్రీకృష్ణుని, తల్లి యశోద అతని దుడుకుతనమును సహింపలేక, రోటికి కట్టివేయప్రయత్నించినది. తనను పట్టుకొనుటకై పరుగెత్తివచ్చు తల్లి బాధను, భరించలేక దయామయుడై ఆమెచేతికి చిక్కినాడు. (అచేతనమైన రోటిని కట్టినట్లే) పలుచోట్లముడులు గలిగిననన్నని చిన్నత్రాటితో తనమేనుబాగుగా నొరుసుకొనునట్లు తల్లిచే కట్టించుకొని, వెక్కి వెక్కియేడ్చుచున్న దామోదరుని పరమసౌలభ్య గుణమును తలచి తలచి నమ్మాళ్వార్లు సమ్మోహితులయినారు. మూర్ఛపోయినారు. నిరతిశయాశ్చర్యగుణ చేష్టితుడైన శ్రీకృష్ణుని నామముకన్న ఆస్వామి నామమును మనసారకీర్తించిన నమ్మాళ్వార్ల తిరునామమును అనుసంధించినచో నాజిహ్వాకు రుచించును. నావాక్కున అమృతము స్రవించును. ఆచార్యులకు ప్రీతిపాత్రమగుటచే భగవద్విషయానుభవమును మొదట కీర్తించారు మధురకవులు.

2. నావినాల్ నవిత్తిన్బమెయ్దినేన్,
మేవినే నవన్పొన్నడి మెయ్మ్మైయే।
తేవు మత్తఱియేన్ కురుకూర్ నంబి,
పావిన్నిశై పాడిత్తిరివనే॥

**అర్థం:-** నావినాల్=నాలుకచే; నవిత్తు=స్తుతించి; ఇన్బమ్=ఆనందమును; ఎయ్దినేన్=పొందితిని. అవన్=ఆయాళ్వారుల; పొన్=స్పృహణీయములైన; అడి=పాదములను; మేవినేన్=ఆశ్రయించినాను. మెయ్మ్మైయే = నిజముగనే; మత్తు=వేఱొక; తేవు=దైవతమును; అఱియేన్=ఎఱుగను, కురుకూర్, నంబి= కురుకాపురి నిర్వాహకులను గురించి; పా, ఇన్=పాశురములను మధురముగా; ఇన్=ఇంపైన; ఇశై=రాగముతో; పాడి=గానముచేయుచు; తిరివనే=తిరుగుచుందును.

**తా॥** మనస్సు సహకరింపకున్నను భగవద్విషయమందు ఉపకరించువారిని జిహ్వచే స్తుతించు నాకు మనస్సు కూడ వశవర్తియైనందున నిరతిశయానంద రూప పురుషార్థమును పొందగల్గితిని. నమ్మాళ్వారుల శ్రీపాదములను ఆశ్రయించినాను. నమ్మాళ్వారులను తప్ప సత్యముగ వేఱొక దేవత నెరుగను, కురుకాపురి నిర్వాహకులను గూర్చి 'కణ్ణినుణ్శిఱుత్తాంబు' తో స్తుతించుచు, వారి భగవదనుభవ పరీవాహరూపమైన 'తిరువాయ్మొళి' అను దివ్యప్రబంధమును ఇంపైన రాగములతో గానము చేయుచు తిరునగరి వీధులలో సంచరించుటయే నాధ్యేయము.

3. తిరి తందాగిలుయ్, తేవపిరానుడై
కరియకోలత్తిరువురు క్కాణ్బన్ నాన్।

51

పెరియవణ్ కురుకూర్ నగర్ నంబిక్కు, ఆ
ళురియనా, యడియేన్ పెత్తనన్మైయే॥

**అర్థం:-** నాన్=నేను; తిరితన్దాగిలుం=తిరుగుచున్నను (బుద్ధినిమరల్చుకొనియైనను) తేవపిరాన్+ఉడై=నిత్యసూరులకు (దేవతలకు) అధిపతియైన సర్వేశ్వరుని యొక్క; కరియ=నల్లని; కోల=సుందరమైన; తిరు=లక్ష్మీదేవితో కూడిన; ఉరు=రూపమును; కాణ్బన్=సేవింతును. పెరియ=మిక్కిలి: వణ్=ఉదారులైన; కురుకూర్ నగర్, నంబిక్కు= కురుకానగర మందవతరించిన ఆళ్వార్లకు; ఆళ్+ ఉరియన్+ఆయ్= శేషభూతుడైన; అడియేన్=ఈదాసుడు; పెత్త=పొందిన; నన్మై=మంచి/శ్రేయస్సు; (భగవల్లాభము) ఏ=అహా! ఎంత అశ్చర్యము.

**తా॥** 'అళ్వార్లను తప్ప వేఱొకటియునెరుగను'- అన్నందున- ఇతర పురుషార్థములతో భగవద్విషయమును కూడ పరిత్యజింతురో! అన్నచో, అచార్యరుచి పరిగృహీతమగు అర్థమేగదా! సత్పురుషులకాశ్రయణీయము; అనుచున్నారు:-

భగవద్విషయమును విడిచి తిరుగుచున్నవాడనైనను, ఆళ్వార్ల సన్నిధి నుండి కొంత సేపు బుద్ధిని మరల్చుకొని, నిత్యసూరులకు అధిపతి యైన సర్వేశ్వరుని యొక్క లక్ష్మీసనాథమగు నీలమేఘనిభ సుందర రూపమును సందర్శించు భాగ్యమును పొందినాను. తిరునగరి-ఉభయ విభూతినాయకుని తన యందు అణచుకొనిన ఆళ్వార్లను కూడ తనలో నణచుకొనిన పెద్ద, విశాల ప్రదేశము కదా! ఇక ఈ తిరునగరిలో నవతరించిన నమ్మాళ్వార్ల ఔదార్యము - సర్వేశ్వరుని ఔదార్యము ప్రసరించనిచోటున కూడ- సర్వత్రప్రసరించి ప్రకాశించును. నిత్యసూరులు మనకు ఇష్టమైనవారు; మధురకవులు అళ్వార్లకు ఇష్టమైన వారు' అని శ్రియఃపతి, అళ్వార్లకు

దాసభూతుడనగుట చేతనే, నాయెదలో ప్రవేశించి, తన స్వరూపమును ప్రకాశింప జేయగా అనుభవించుచున్నాను, ఈ లాభము ఆచార్యుల కృపచే సిద్ధించినది.

**4. నన్మైయాల్ మిక్క, నాల్మత్తైయాళర్గళ్,**
**పున్మైయాక క్కరుతువ రాదలిల్।**
**అన్నైయా యత్తనా యెన్నై యాణ్డిడుమ్**
**తన్మై యాన్, శడకోప నెన్నంబియే॥**

**అర్థం:-** నన్మైయాల్=మంచితనముచే; మిక్క=మించినట్టి; నాల్ నాలుగు; మత్తై= వేదములను; ఆళర్గళ్=తెలిసికొని అనుష్ఠించువారు; పున్మై, ఆక=(నన్ను) నీచముగా; కరుతువర్=తలంతురు. ఆదలిల్=కావున; అన్నై, ఆయ్ం=తల్లియైం; అత్తన్+ఆయ్ం=తండ్రియైం; ఎన్నై=నన్ను; ఆణ్డిడుమ్=ఏలుకొను; తన్మైయాన్=స్వభావముగల; శడ, కోపన్=(నా) శాఠ్య (దౌష్ట్య) మును పోగొట్టిన ఆళ్వార్లు; ఎన్, నంబియే=నాకొఱతను దీర్చిన గుణపూర్ణులే.

**తా॥** నా అయోగ్యతను చూడక, నన్నుఅంగీకరించిన ఆళ్వార్ల పరమ సౌలభ్యగుణమును అనుసంధించక మరచితి నేని,- అపకారులకును మహోపకారముచేయు ఆర్జనశీలురు, చతుర్వేద విభాగమునను, దాని అర్థనిర్ణయమునను వేదవ్యాసుని వంటి సమర్థులు, వైదిక ధర్మనిష్ఠా తత్పరులు-నన్ను కృతఘ్నునిగా పరమనీచునిగా భావింతురు. తల్లి చేయుదానిని తండ్రి చేయజాలడు; తండ్రి చేయునది తల్లిచేయజాలదు. ఆచార్యుడు చేయు ఉపకారమును వారిరువురు చేయజాలరు. దాసునికి ప్రియమునగూర్చు తల్లియైం, హితాను శానకుడగు తండ్రియైం,

ఏలుకొనుస్వభావము గల స్వామియై, వేయేల? సర్వాచార్య గుణపరిపూర్ణులైన శ్రీనమ్మాళ్వార్లే నా దుష్టస్వభావమును, అవివేకమును పోగొట్టినారు. ఇక నాకేమి కొఱత? ఈ పాశురము మధురకవుల ఆచార్యనిష్ఠకు సాక్షికదా!

**5. నంబినేన్ పిఱర్‌నన్ బొరుళ్ తన్నైయుమ్,**
**నంబినేన్ మడవారైయు మున్నెలామ్।**
**శెంబొన్ మాడ తిరుక్కురుకూర్ నంబిక్కు**
**అన్‌బనా యడియేన్, శదిర్త్తే నిన్ఱే॥**

**అర్థం:-** మున్నెలాం=పూర్వకాలమంతయు: పిఱర్=పరుని; (సర్వేశ్వరుని) నల్=విలక్షణమైన; పొరుళ్ తన్నైయుమ్=(ఆత్మ) వస్తువును; నంబినేన్=(నాది,అని) నమ్మినాను. మడవారైయుం=పరస్త్రీలను గూడ; నంబినేన్=ఆశించినాను. శెం=మేలైన; పొన్=స్వర్ణమయమైన; మాడ=మేడలు గల; తిరుక్కురుగూర్ = తిరునగరిలోని; నంబిక్కు=గుణపూర్ణులైన ఆళ్వార్లకు; అన్‌బన్+ఆయ్ = శేషభూతుడనై; అడి, ఏన్=దాసుడనగు నేను; ఇన్ఱే=ఇప్పుడే; శదిర్త్తేన్ = చతురుడనైతిని.

**తా॥** పూర్వపు నాచిత్త వృత్తివేరు; ఇప్పటిదివేరు. సర్వేశ్వరునికి శేషభూతమైన, 'ఆత్మ' అనువస్తువును నా సొంతసొమ్ము అని నమ్మియుంటిని. పరస్త్రీల సాంగత్యము గూడ కోరుకొంటిని. కాని, సువర్ణసౌధములతో శోభించు శ్రీ మత్కురుకాపురిలో దేదీప్యమానముగ వేంచేసి యున్న నమ్మాళ్వారులను ఆశ్రయించిన నాటి నుండి నాకు భగవద్విషయ ప్రావణ్యము పెరిగి, అతిసమర్థుడనైనాను.

**వివరణ:-** పిఱర్= పరుడు, భగవంతుడు చిత్, అచిత్తు (జీవ, ప్రకృతు) లతో కూడియున్నను, చిదచిత్తులకు సహజముగ నుండు అజ్ఞత్వ, దుఃఖిత్వ,

పరిణామాది కార్యజాతము తనకు సుతరామంట కుండుటచే- చిదచిద్వి శిష్టుడయ్యు చిదచిద్విల క్షణుడగుటచే-'వరుడు' అనుశబ్దము భగవత్సంజ్ఞావాచకము. "ఆత్మేశస్తు పరఃపుమాన్'- ఆత్మ 'పరుని' సొమ్ము. కాబట్టి, ఆత్మను 'నాది' అని తలచుట 'ఆత్మాపహారము' అనెడు అత్యంతదోషము.

6. ఇన్ఱుతొట్టు మెళుమైయుమెంబిరాన్,
నిన్ఱుతన్పుగళేత్త వరుళినాన్।
కున్ఱమాడత్తిరుక్కురు గూర్ నంబి,
ఎన్ఱు మెన్నై యికళ్ విలన్ కాణ్మినే॥

**అర్థం:-** ఇన్ఱుతొట్టుమ్=నేడు మొదలుకొని; ఎళుమైయుమ్=ఇకముందు కాలమంతయు; ఎం, పిరాన్=నాకు ఉపకారులైన, ఆళ్వార్లు; నిన్ఱు=స్థిరముగ; తన్=తమయొక్క; పుగళ్=కల్యాణ గుణములను (కీర్తిని); ఏత్త=(నేను) స్తుతించునట్లు; అరుళినాన్=అనుగ్రహించినారు. కున్ఱ=పర్వతములవంటి; మాడ=మేడలుగల; తిరుక్కురుగూర్నంబి=శ్రీకురుకాపురాధీశులు (నమ్మాళ్వారులు) ఎన్ఱుమ్= ఎన్నడును; ఎన్నై=నన్ను; ఇకళ్, విలన్=అనాదరింపరు. కాణ్మినే=కనుడీ.

**తా॥** ఆళ్వార్లు ఇపుడు అనుగ్రహించినను, అనాది కాలవాసనా బలమున నీకు విషయము లందు మరల అభిరుచికలుగ కుండునా? అనినచో, భగవంతుని ఆశ్రయించుటకు ఒక కాలము, ఫలసిద్ధికి మఱియొక కాలము సంభవించునేమో! కాని, ఆళ్వార్లను ఆశ్రయించిన క్షణము నుండి ఫలము అనుభవింపబడుచునే యుండును. పరమోపకారులైన అళ్వార్లు అనుగ్రహించిన ఈ దినము నుండి కాలతత్త్వమున్నంత వరకును భగవల్లాభాది పురుషార్థములు లభించినప్పటికి, నాలో మార్పు ఏమాత్రము కలుగక,తమ విభవాతిశయములనే

నేను సదాస్తోత్రము చేయునటుల కటాక్షించినారు. కొండలవలె ఉన్నత సౌధములతో నొప్పారు కురుకాపురికి నిర్వాహకులైన నమ్మాళ్వార్లు ఇక నన్నెప్పుడును విషయసాగరములో మునుగనీయరు; చెడ్డమార్గములకు పోనీయరు సుమా! కాబట్టి, ఆళ్వార్ల కృపాతిశయము అపారమయినది కదా!

7. కణ్ణికొండెన్నై, క్కారిమాఱప్పిరాన్,
పణ్డైవల్వినై పాత్తి,యరుళినాన్।
ఎణ్డిశైయుమఱియ, వియంబుగేన్,
ఒణ్డమిళ్ చ్చడకోప నరుళైయే॥

**అర్థం:-** ఎన్నై=నన్ను; కణ్ణికొండు=కటాక్షించి; కారి, మాఱ,ప్పిరాన్='కారి' నూనులైన, మాఱన్, అనుతిరునామముగల మహోపకారులు; పండై=అనాదియైన; వల్=బలిష్ఠ ములైన ; విన్నై=పావములను; పాత్తి=రూపుమాపి; అరుళినాన్=అనుగ్రహించినారు. ఒణ్=శ్లాఘ్యమైన; తమిళ్=ద్రావిడ ప్రబంధములను అనుగ్రహించిన; శడకోపన్= నమ్మాళ్వార్ల యొక్క; అరుళైయే=కృపనే; ఎణ్+తిశైయుమ్=ఎనమిది దిక్కులందుండు వారును; అఱియ=ఎరుగునట్లు; ఇయంబుగేన్= కీర్తించుచున్నాను.

**తా॥** సాత్త్వికులు అంగీకరింపని, విషయభూయిష్ఠుడనైన నన్ను విశేషముగ కటాక్షించినారు. అనాది సిద్ధమైన నా పాపరాశిని భస్మీపటలము చేసి, శ్రీ కారి మహారాజుకు పుత్రులై 'మాఱన్' అను తిరునామముగల నమ్మాళ్వారులు, తమను సర్వకాల సర్వావస్థలయందు స్తోత్రము చేయుభాగ్యమును నాకు ప్రసాదించినారు. 'మోక్షయిష్యామి'- సర్వేశ్వరుడు 'నేను తరువాత విడిపించ గలను' - అని చెప్పినట్లుగాక , మొదటనే నాజన్మదుఃఖమును నిర్మూలించి తమకు అంతరంగ శిష్యునిగా స్వీకరించినారు. ప్రత్యక్షరము

మకరందస్యందియై యున్న, వారి దివ్యప్రబంధములను దాసునికి అనుగ్రహించినారు. అంతే వాసియైన నాకు కవితా మధురిమను కృప జేసిన నమ్మాళ్వారుల కృపా ప్రభావమునే సర్వదిశలయందుండు వారు. ఆబాలగోపాలము, తెలిసికొని ఉజ్జీవించునటుల విశదముగ అభివర్ణించుచున్నాను.

**8. అరుళ్ కొండాడు మడియవ రిన్బుఱ,**
**అరుళినా నవ్వరు మఱైయిన్‌పొరుళ్।**
**అరుళ్ కొండాయిర మిన్దమిళ్ పాడినాన్,**
**అరుళ్ కండీ రివ్వులగినిల్ మిక్కదే॥**

అర్థం:- అడియవర్=దాసులు; ఇన్బు=ఆనందము; ఉఱ=అతిశయింపగా, అరుళ్=కృపను; కొండాడుం=కొనియాడునటుల; అవ్వరు=(అ+అరు) అపూర్వమైన; మఱైయిన్=వేదము యొక్క; పొరుళ్=అర్థమును; అరుళినాన్= అనుగ్రహించినారు. అరుళ్, కొండు=(శ్రియఃపతి) కృపను అవలంబించి; ఆయిరం=వేయి పాశరములతో; తమిళ్='తిరువాయ్‌మొళి:- అనుదివ్య ప్రబంధమును; ఇన్=ఇంపుగా; పాడినాన్=గానముచేసిరి. అరుళ్=(ఆళ్వార్ల) కృప; ఇ+ఉలగినిల్= ఈలోకమందు; మిక్కదే=మిక్కుటమై యుండుటను; కండీర్=చూచితిరా.

**తా॥** ఓ భక్తాగ్రేసరులారా! శేషభూతులందరు ఆనంద నిర్భరులై తమనుకొనియాడునట్లు అపూర్వమైన వేద గంభీరార్థములను ఆళ్వార్లు తేటతెల్లమొనరించినారు. భగవత్కృప వలన లభించిన దివ్యజ్ఞాన భక్తులచే పరిపూర్ణులై. సహస్రగాథా పరిమితమగు ద్రావిడ ప్రబంధమును సరసముగా పాడినారు. స్వాచార్యులగు నమ్మాళ్వారుల కృపాప్రవాహము

దిగ్గింతములందును వ్యాపించి, ప్రపన్నులచే స్తుతింపబడుటను కాంచినారా!

**వివరణ:-** కరుణ సాధనము: కైంకర్యము పురుషార్థము. కృపలేనిచో ఇతర గుణములున్నను కృతకృత్యములు కావు. సంసారసంబంధమును తెగగోసి, ఉద్ధరించునది కృపయే కాబట్టి, ముముక్షువులు కృపాగుణమును కొండాడు చుందురు.

**9. మిక్క వేదియర్ వేదత్తిను ట్పొరుళ్;**
**నిఱ్కప్పాడి యెన్నెంజుళ్ నిఱుత్తినాన్**
**తక్కశీర్ శడకోప నెన్నంబిక్కు; ఆ**
**ట్పుక్క కాదలడిమైప్పయనన్రే॥**

**అర్థం:-** మిక్క=మించిన, వేదియర్=వైదికులు అనుసంధించు; వేదత్తిన్ =వేదములందలి; ఉళ్=రహస్యములైన; పొరుళ్=అర్థములను; నిఱ్క=స్థిరముగ నుండు నటుల; పాడి=గానముచేసి; ఎన్=నా యొక్క; నెంజుళ్=మనుస్సున; నిఱుత్తినాన్=నిండుగా నిలిపినారు; తక్క=తగిన; శీర్=గుణపూర్తిగల; శడకోవన్=శఠులను కోపించునట్టి; ఎన్, నంబిక్కు; నాస్వామియైన నమ్మాళ్వారులను; ఆళ్, పుక్క=ఆశ్రయించుట యందు కలిగిన; కాదల్=ప్రేమ; అడిమై=దాస్యమునకు; పయన్=ప్రయోజనము; అన్రే=కాదా!

**తా॥** అనేక వేదశాఖలను అధ్యయనము జేసిన వైదికులు నిక్షేపముగా నుంచుకొనిన వేదములలోని రహస్యార్థములను విశ్వవ్యాప్తముగ, స్థిరముగ నిలిచియుండు నట్లు, పాడి నా మనుస్సున సుప్రతిష్ఠితముచేసినారు. అజ్ఞుల శాఠ్యమును పోగొట్టి విజ్ఞులజేయు నా స్వామి, ఆళ్వార్లను ఆశ్రయించ వలయునని కలిగిన ప్రేమ, దాస్యమునకు పరమప్రయోజనము కాదా!

**వివరణ:-** భగవద్దాస్యము భాగవతదాస్య పర్యంతము వ్యాపించుటయే వేద

రహస్యార్థము. భగవద్విషయమున ఆళ్వార్లవలె, ఆచార్యుల యెడ మధురకవులు ప్రేమతో దాస్యము వహించిరి.

10. పయనన్ఱాగిలుమ్, పాంగలరాగిలుమ్,
శెయల్ నన్ఱాగ, త్తిరుత్తిప్పణికొళ్వాన్।
కుయిల్ నిన్ఱార్, పొళిల్ శూళ్కురుగూర్ నంబి,
ముయల్కిన్ఱే నున్ఱన్, మొయ్ కళఱ్కన్బై యే॥

**అర్థం**:- పయన్, అన్ఱు, ఆకిలుమ్=ప్రయోజనములేక పోయినను; పాంగలర్; ఆకిలుమ్=అనుకూలురుకాని వారు, అయినను; శెయల్=చేష్టలు; నన్ఱు, అగ= చక్కనగునట్లు; తిరుత్తి=దిద్ది; పణి=పని (కైంకర్యము). కొళ్వాన్=చేయించు కొందురు. కుయిల్=కోకిలలు; నిన్ఱు=నిలిచి; ఆర్=సమృద్ధిగా శబ్దించు; పొళిల్=తోటలచే; శూళ్=చుట్టబడియున్న; కురుగూర్, నంబి=తిరునగరికి, నిర్వాహకుడవైన ఓ స్వామీ! ఉన్ఱన్=మీయొక్క; మొయ్=శ్లాఘ్యమైన; కళఱ్క= శ్రీచరణమ్ము లందలి; అన్బైయే= ప్రీతినే; ముయల్కిన్ఱేన్=యాచించున్నాను.

**తా॥** కోకిలల పంచమస్వరకూజితములచే నిండిన రమ్యోద్యానములతో నలరారు తిరునగరియందు వేంచేసి యున్న ఓ స్వామీ! చేతనులు నిష్ప్రయోజకులైనను, అనుకూలురు కాకపోయినను, మీ అనుష్ఠానముతో వారిని చక్కదిద్ది, భగవద్భాగవతాచార్యకైంకర్యపరులనుగా జేసి స్వీకరించు మహిమాన్వితులు మీరు. దేవరవారి శ్రీపాదపద్మములను నిరంతరము కొలిచే-సేవించే నిరవధిక భక్తిని, యాచించు నాకు, అనుగ్రహింపుడు.

వివరణ:- నమ్మాళ్వార్లు 'కాణవారాయ్' - (స్వామీ! నాకు దర్శనమీయవా?) అని ఆక్రోశించిరి. అట్టి మాటలనే విని కోకిలలు కూడ, శిష్యులవలె, పలుకుచుండును. ఆళ్వార్లకృప వలన పక్షులు వివేకముతో ప్రబంధగానము చేయుచుండగా, మానవులు వివేకవంతులగుట ఆశ్చర్యమా!!

**11. అన్బన్దన్నై యడైందవర్గట్కెల్లా**
**మన్బన్, తెన్ కురుగూర్నగర్ నంబిక్కు।**
**అన్బనాయ్ మదురకవిశొన్న శొల్,**
**నంబువార్ పది, వైగుందం కాణ్మినే॥**

**అర్థం:-** అన్బన్ తన్నై=భక్తవత్సలుడగు భగవంతుని; అడైందవర్ గళ్కు, ఎల్లామ్=ఆశ్రయించిన వారందరి యందును; అన్బన్=ప్రేమ గలవారును; తెన్=అందమైన (దక్షిణముననున్న) కురుగూర్ నగర్ నంబిక్కు=కురుకాపురికి నిర్వాహకులగు నమ్మాళ్వారులకు; అన్బన్+ఆయ్=ప్రీతిపాత్రుడైన; మదురకవి=మధురకవి యాళ్వార్లు; శొన్న=చెప్పిన, శొల్=మాట (పాశురము)లను; నంబువార్=నమ్మియుండువారికి; పది=నివానము; వైగుందమ్= వైకుంఠము (అని) కాణ్మినే=తెలిసికొనుడీ.

**తా॥** ఆశ్రిత వత్సలుడైన శ్రియః పతిని ఆశ్రయించిన వారందరియెడ పరమ ప్రీతిగల నమ్మాళ్వారులు తిరునగరికి సరస నిర్వాహకులు, వారికి ఆనన్యార్హ శేషభూతులగు శ్రీమధుర కవి యాళ్వార్లు స్వాచార్యనిష్ఠతో అనుగ్రహించిన ఈ 'కణ్ణినుణ్ శిఱుత్తాంబు' అను ప్రబంధమును తమకు రక్షక మని విశ్వసించి, అభ్యసించు పరమభాగవతోత్తములకు పరమ పదమే ప్రాప్తించును. ధ్రువము.

**వివరణ:-** 'కట్టుణ్ణప్పణ్ణియ' అను టచే సౌలభ్యమును, పెరుమాయన్- సౌశీల్యమును, ఎన్నప్పన్ స్వామిత్వమును కీర్తించుటతో ఆరంభించి- 'అన్బన్తన్నై' అను వాత్సల్యగుణ గానముతో ముగింపబడినది.

మధురకవి యాళ్వార్తిరువడిగళే శరణమ్.